చందమామ
సంపుటి 109 నవంబర్ 2003 సంచిక:5

## ఈ నెల విశేషాలు





## ఈ సంచికలో...



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**

***Remittances in favour of Chandmama India Ltd.***
to

Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: 900
ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

# ప్రతిఘటనలు : నాడు-నేడు

ఈ సంచికలో మన పూర్వగాథలు శీర్షికన ప్రచురించిన 'ఒక ప్రతిఘటన!' కథను చదివాక ఈ సంపాదకీయం చదివితే బావుంటుంది. ఇరుకుగా ఉన్న దారిలో ఇద్దరు రాజులు రథాలపై ఒకరికొకరు ఎదురవుతారు. ఒకరు వెనక్కు వెళితేనే రెండవవారు ముందుకు వెళ్ళగలరు. వారు ఏం చేశారన్నదే ఆ కథ.

ఈ కథ 2,500 సంవత్సరాల నాటి బుద్ధ జాతక కథల నుంచి తీసుకోబడింది. ఇటీవల సరిగ్గా ఇలాంటి పరిస్థితే ఒక నగరంలో ఏర్పడింది. ఇద్దరు ప్రభుత్వ అధికారులు వేరు వేరు వాహనాలలో ఒకరికొకరు ఎదురెదురుగా ఒక ఇరుకైన వంతెన మీద తారసపడ్డారు. ఒక వాహనాన్ని వెనక్కు నడిపించి ఎదుటివారికి దారి ఇవ్వడానికి ఇరువురిలో ఏ ఒక్కరూ సిద్ధంగా లేరు. మాటా మాటా పెరిగింది. ఆఖరికి, ఒక అధికారిని రెండవ అధికారి అనుచరులు ఆగ్రహంతో చుట్టుముట్టి పట్టుకుపోయారు. మొదటి అధికారి మనుషులు వెళ్ళి దాపుల నున్న పోలీసు స్టేషన్‌లో తమ అధికారి 'అపహరణ' జరిగినట్టు ఫిర్యాదు చేశారు.

ఆ తరవాత ఏం జరిగింది అన్నది అంత ముఖ్యం కాదు. ఉన్నత అధికారులు జోక్యం చేసుకుని ఇరువురి మధ్య సయోధ్య కుదిర్చారు. అది వేరే విషయం.

అయితే, ఎదుటివారిని కూడా మనలాగే భావించి గౌరవించే సభ్యత విషయంలోనూ, ఓర్పును పాటించడంలోనూ ఎంత వరకు మనం పురోగమించాము అన్నదే ఇక్కడి ప్రశ్న. ప్రతి ఒక్కరూ దీనిని గురించి తమను తామే ప్రశ్నించుకోవడం ముఖ్యం!

సంపాదకుడు : విశ్వం

Visit us at : http://www.chandamama.org



# Junior CHANDAMAMA






Do you want your children to sharpen their faculties by working on puzzles?
**Come to Junior Chandamama for loads of puzzles and games.**



Are you looking out for interesting new stories to be read out to the kiddies?
**Pick up a copy of Junior Chandamama, and you'll find them there.**



Does your child have a taste for colouring and you want to develop the habit?
**Junior Chandamama is what you must get for your child.**



Want your kid to learn all about the culture and heritage of India?
**Only Junior Chandamama can help you.**

**PAGE AFTER PAGE WILL KINDLE YOUR CHILD'S IMAGINATION**

**ISSUE AFTER ISSUE, MONTH AFTER MONTH**

## SUBSCRIPTION FORM

Please enrol me as a subscriber of Junior Chandamama. I give below the required particulars:

Name : ........................................

Address : ........................................

........................................

........................................

PIN Code : ........................................

*I am remitting the amount of Rs.120/-* for 12 issues by Money Order/Demand Draft/Cheque No...................... on.................................... Bank ...................................... branch *drawn in favour of* Chandamama India Ltd., encashable at Chennai (outstation cheque to include Rs.25/- towards Bank Commission).

Place : ...................

Date : ...................                Signature



# సకలయ్య సలహా

గట్టుపల్లి అనే గ్రామంలో, ప్రతిశుక్రవారం పశువుల సంత జరుగుతూండేది. ఆ సంత మేలు జాతి పశువుల అమ్మకానికీ, కొనుగోలుకూ చాలా ప్రసిద్ధిచెందింది.

ఒకసారి శివానందం అనే దూర గ్రామపు రైతు, ఎడ్లజతను కొనేందుకు బయల్దేరి, గురువారం రాత్రికి గట్టుపల్లి చేరి, ఆ రాత్రికి గ్రామ సత్రంలో బసచేశాడు. అక్కడ అంతగా దొంగల భయం లేకపోయినా, కీడెంచి మేలెంచమన్నారనుకుంటూ, తన దగ్గరున్న ఐదు వందల రూపాయలను దాచమని సత్రం యజమాని దేవయ్యకిచ్చాడు. తెల్లవారాక శివానందం పశువుల సంతకు బయల్దేరుతూ, దేవయ్యను తన ఐదు వందల రూపాయలూ ఇవ్వమని అడిగాడు.

దేవయ్య లేని ఆశ్చర్యాన్ని నటిస్తూ, "ఐదు వందలా? నా దగ్గర దాచావా? నువ్వు అమాయకుడివా లేక నన్ను అమాయకుడనుకుంటున్నావా?" అన్నాడు. ఆ జవాబుకు శివానందం విలవిలలాడి పోతూ, "ఇంతకూ తమరనేదేమిటి? రాత్రి తమకు దాచమని ఐదు వందల రూపాయలు ఇవ్వలేదంటారా?" అని అడిగాడు.

"అవును, నేననేది అదే! నువ్వు ఐదు వందలు కాదుగదా, ఐదు రూపాయలు కూడా నాకు దాచమని ఇవ్వలేదు, సరా?" అన్నాడు దేవయ్య రుసరుసలాడుతూ.

శివానందం దిగాలు పడిపోయి, మారు మాట్లాడకుండా వీధిలోకి వచ్చేశాడు. అతడి దీనస్థితి గమనించిన గ్రామస్థుడొకడు, శివానందాన్ని అడిగి సంగతి తెలుసుకుని, "నీ డబ్బు నీకు తిరిగి రావాలంటే ఒకటే మార్గం వుంది. అదుగో, ఈ వీధి చివర, ఆ కనబడే పెద్ద రావిచెట్టు పక్కనవున్న డాబాఇంట్లో సకలయ్య అనే తెలివిమంతుడొకాయన వున్నాడు. వెళ్ళి, జరిగింది చెప్పుకో," అన్నాడు.

శివానందం, సకలయ్య దగ్గరకు వెళ్ళి తనపేరూ, తను ఏ ఊరివాడయిందీ చెప్పుకుని, సత్రం యజమాని దేవయ్య చేసిన మోసం గురించి చెప్పాడు.

మేకల మదన్ మోహన్ రావు

"ఆ దేవయ్యను ఎరిగిన వాళ్ళందరూ, అతడంతగా నమ్మదగిన మనిషి కాదని అంటున్నారు. సరే, మరొక ఐదు వందల రూపాయలు తెచ్చి, రాబోయే గురువారం రాత్రి సత్రంలోనే బసచేసి, ఆ డబ్బును దేవయ్యకు దాచమని ఇవ్వు. ఐతే, ఈ సారి రామాలయపు పూజారిని వెంటబెట్టుకు పో. అతడిసమక్షంలో ఆ ఐదు వందలూ దేవయ్యకు ఇవ్వు. పూజారికి కాస్త తోడుగా నీ వెంట వెళ్ళమని, నేను చెబుతాను," అన్నాడు.

సకలయ్య చెప్పినట్టే శివానందం మరుసటి గురువారం రాత్రి పూజారితో కలిసి వెళ్ళి, దేవయ్యకు దాచమని మరొక ఐదు వందలు ఇచ్చాడు.

మర్నాటి ఉదయం శివానందం, సకలయ్యను కలుసుకుని, "ఇప్పుడేం చేయమంటారు?" అని అడిగాడు.

"ఇప్పుడు ఒక్కడివే వెళ్ళి, ఆ ఐదు వందలూ ఇవ్వమని దేవయ్యను అడుగు," అని సలహా ఇచ్చాడు సకలయ్య.

శివానందం వెళ్ళి ఐదు వందల సంగతి అడగగానే, తానా డబ్బు తీసుకున్న సమయంలో పూజారి సాక్షిగా వున్నాడు గనక, చేసేది లేక దేవయ్య, శివానందానికి డబ్బు ఇచ్చాడు. ఆ వెంటనే శివానందం తిరిగి సకలయ్య దగ్గరకు వెళ్ళి, తాను లోగడ ఇచ్చిన ఐదు వందలూ దేవయ్య నుంచి ఎలా రాబట్టాలో తెలియడంలేదన్నాడు.

"అదేం పెద్ద సమస్యకాదు. సాయంత్రం పూజారిని వెంటబెట్టుకుపోయి, నువ్వు దాచిన డబ్బు ఇవ్వమని అడుగు," అన్నాడు సకలయ్య.

ఆ విధంగా ఆ సాయంకాలం శివానందం, పూజారితో కలిసి వెళ్ళి, తను దాయమని ఇచ్చిన ఐదు వందలూ అడగగానే, పూజారి ఎదట ఆ డబ్బు తీసుకున్నాడు గనక, చేసేది లేక డబ్బు శివానందానికి ఇచ్చేశాడు.

శివానందం సంతోషంగా సకలయ్య వద్దకు వచ్చి, తన డబ్బు వసూలయ్యే మార్గం చెప్పినందుకు, అతడికి తన కృతజ్ఞత చెప్పుకుని, అతడి సాయం ఎన్నటికీ మరిచి పోనన్నాడు. అందుకు సకలయ్య నవ్వుతూ, "డబ్బు విషయంలో చాలా జాగ్రత్త అవసరం. దొంగలూ, మోసగాళ్ళూ అడవుల్లోనూ, కొండల్లోనే కాదు; సత్రాల్లో, వీధుల్లో కూడా వుంటారు!" అన్నాడు.

– (ఐర్లండ్ కథ ఆధారంగా)





# భల్లూక మాంత్రికుడు

పూర్వం బ్రహ్మపుత్రానదీ తీరపు అరణ్యాల్లోని ఒక గ్రామంలో, కాళీవర్మ అనే క్షత్రియ యువకుడు వుండేవాడు. అతడి తండ్రి మహాయోధుడు. చంద్రశిలానగరపు రాజు కొలువులో సైనికోద్యోగిగా వుంటూ, ఒక యుద్ధంలో మరణించాడు. అప్పటికి కాళీవర్మ పదేళ్ళ వయసువాడు. అతడి తల్లి, భర్త పోయిన దిగులుతో త్వరలోనే చనిపోగా, బలభద్రుడనే విశ్వాసపాత్రుడైన నౌకరు, అతణ్ణి పెంచి పెద్దచేసి, అన్ని క్షత్రియ విద్యలూ నేర్పాడు.

కాళీవర్మకు ఇరవై ఏళ్ళవయసు నిండగానే, బలభద్రుడు అతడితో, ''కాళీ, ఇక నువ్వీ కుగ్రామం వదిలి, రాజధానీ నగరానికి పోయి, అక్కడ రాజుగారి కొలువులో ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవటం మంచిది,'' అన్నాడు.

కాళీవర్మక్కూడా కొన్నాళ్ళుగా ఇలాంటి ఆలోచనే మనసులో మెదులుతున్నది. కానీ, తమ ప్రాంతాలను పాలించే రాజు జితకేతుడంటే అతడికేమాత్రం గౌరవం లేదు. రాజు పల్లె ప్రజల నుంచి పన్నులు వసూలు చేయడంలో సమర్థుడేకాని, వాళ్ళను వన్య మృగాల నుంచీ, బందిపోటుదొంగల నుంచీ కాపాడటంలో సమర్థుడు కాదు.

కాళీవర్మ ఈ మాటే బలభద్రుడితో చెప్పి, ''ఆ చంద్రశిలా నగరాన్ని పాలించే రాజు జితకేతు అసమర్థుడు, పిరికివాడు. అలాంటి వాడి కొలువులో సైనికుడుగా చేరి పొట్టపోసుకోవటంకన్న మరి అవమానం వుండదు,'' అన్నాడు.

ముసలి బలభద్రుడు కాసేపు ఆలోచించి, ''రాజుల పరిపాలనా దక్షత చాలావరకు వాళ్ళ ఆస్థానంలో ఉద్యోగులుగా వుండే



వాళ్ళ మీద ఆధారపడి వుంటుంది. ఈ జిత కేతు తండ్రి కొలువులో నీ తండ్రిలాంటి ప్రతాపవంతులూ, బుద్ధిశాలులూ వుండేవారు. ఆ రాజు మరణానంతరం ఈ జితకేతు సింహాసనం ఎక్కాడు. నా అనుమానం అతడి చుట్టూ కుక్షింభరులూ, ముఖప్రీతి కబుర్లాడే వారూ చేరివుంటారు,'' అని అన్నాడు.

''అంతేకావచ్చు! అలాంటి రాజును నేనొక్కణ్ణే ఉద్ధరించగలనా? ఈ గ్రామంలోనే ఉన్న పొలం దున్నుకుని బతుకుతాను,'' అన్నాడు కాళీవర్మ.

''ఆ పని నీలాంటి క్షత్రియ యువకుడు చేయవలసిందికాదు. పైగా నీ తండ్రి మరణించేముందు, తన తుదికోర్కెగా నాకు చెప్పి పోయిందేమిటో తెలుసా?'' అంటూ బలభద్రుడు ఇంటిలోపలికి దారితీసి, అక్కడ ఏనాడూ తెరవనిగది తలుపుల తాళం తీసి, కాళీవర్మను తన వెంట లోపలికి తీసుకుని పోయాడు.

ఆ గదిలో కాళీవర్మ తండ్రి ఉపయోగించిన రకరకాల ఆయుధాలూ, కవచం, దాని పక్కన బంగారు పిడిగల కత్తీ వున్నాయి. బలభద్రుడు కత్తిని కాళీవర్మ నడుముకు బిగించి, కవచాన్ని తొడిగి, ''ఆహా! ఇవి నీకు అతికినట్టు సరిపోయాయి, క్షత్రియ యోధుడుగా జన్మసాఫల్యం చేసుకోమని నీ తండ్రి ఆజ్ఞ; తరవాత నీ ఇష్టం,'' అన్నాడు.

తండ్రి తన కోసం వదిలిపోయిన కవచం, కత్తీ ధరించగానే కాళీవర్మ శరీరం పొంగిపోయింది. అతడు ఒరలో నుంచి కత్తిని లాగి, దానిపదును పరీక్షించిచూసి, ''భద్రా, తండ్రిగారి ఆజ్ఞను శిరసావహిస్తాను! నా భవిష్యత్తును తీర్చిదిద్దవలసింది మొక్కపోయిన నాగటికర్రు కాదు; పదునైన ఈ వాడికత్తి,'' అన్నాడు.

ఆ మాటలకు బలభద్రుడు చాలా సంతోషించాడు. ఆ మర్నాడే కాళీవర్మ చంద్ర శిలా నగరానికి ప్రయాణమయ్యేందుకు అన్నీ సిద్ధంచేశాడు. కాళీవర్మ కవచం ధరించి, కత్తిని నడుముకుబిగించుకుని, దారిఖర్చులకుగాను నూరు బంగారు మాడలు తీసుకుని, గుర్రాన్నెక్కి బయలుదేరాడు. రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించిన తరవాత, ఆరు నెలల్లో తిరిగి ఒకసారి తప్పక గ్రామానికి వస్తానని బలభద్రుడికి, అతడు మాట ఇచ్చాడు.

అరణ్యమార్గాలవెంట కాళీవర్మ ప్రయాణం, మిట్టమధ్యాహ్నం వరకూ ఎలాంటి ఒడిదుడుకులూ లేకుండా సాగింది. అతడు వెంట తెచ్చుకున్న రొట్టెలు తిని, ఏ చెట్టు కిందనైనా కొంచెంసేపు విశ్రాంతి తీసుకుందామనుకుని, నీళ్లకోసం ఎక్కడైనా కొండవాగు కనబడుతుందేమో అని, మార్గం నుంచి గుర్రాన్ని పక్కకు

తిప్పి కొంత దూరం పోయేంతలో, ఒక చెట్టు మీది నుంచి అతడికి పెద్దగా మూలుగు వినిపించింది.

కాళీవర్మ ఆశ్చర్యపోతూ తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి చూశాడు. కొమ్మల్లోంచి మానవాకారం ఒకటి చిన్నగా కేక పెట్టి, దభీమంటూ జారి, నేల మీదపడింది. కాళీవర్మ చప్పున గుర్రం దిగి ఆ మనిషి దగ్గిరకు పోయాడు. అతడు బాగా వయసు మళ్ళినవాడు. పై నుంచి పడినందువల్ల అతడు గాయపడిన సూచన లేమీలేవు. ముసలివాడు లేచి నిలబడబోయి, నడుంపట్టుకుని పెద్దగా మూలిగి, తిరిగి నేలమీద చతికిలబడ్డాడు.

కాళీవర్మ అతణ్ణి సమీపించి, "ఏం, తాతా, ఈ వయసులో నువ్వు చెట్టు ఎక్కటం ఏమిటి? జిహ్వాచాపల్యం కొద్దీ తేనెతుట్టె కొట్టబోయావా?" అని అడిగాడు.

ముసలివాడు, కాళీవర్మ కేసి ఒకటి రెండు క్షణాలు పరీక్షగాచూసి, "నాయనా, నువ్వేదో రాజుగారి భటుడిలావున్నావు, అవునా? సాధారణంగా పంటల తరుణంలో పన్నులు వసూలు చేసేందుకు తప్ప, మీరు ఈ ప్రాంతంలో మరేనాడూ కనబడరు గదా!" అన్నాడు.

"నేను రాజభట్టుణ్ణికాదు; ఆ ఉద్యోగం కోసం నగరానికి పోతున్నవాణ్ణి. నేనడిగిన దానికి జవాబు చెప్పావుకాదే! తేనెతుట్టె ఎక్కడ? కాళ్లూ, చేతులూ విరక్కపోవటం నీ అదృష్టం," అన్నాడు కాళీవర్మ.

ముసలివాడు మౌనంగా లేచి నిలబడి, నాలుగైదడుగులు నడిచి, తృప్తిగా తలా డిస్తూ, "నువ్వన్నట్టు అదృష్టవంతుణ్ణే. అలా కాకపోతే, ఈ సారి బందిపోటు దొంగలు గ్రామం మీద పడినప్పుడు, ఇంటనే వుండి



పోయి, వాళ్ళవల్ల నానా హింసలూ పడవలసి వచ్చేది," అన్నాడు.

ముసలివాడు ఇలా అన్న తరవాత కాళీవర్మకు సంగతి కొంతవరకు అర్థమైంది. ముసలివాడు బందిపోటుదొంగల నుంచి పారిపోయి వచ్చి, చెట్టు మీద దాక్కుని, అక్కడ పట్టుజారి కింద పడ్డాడన్న మాట!

"తాతా, ఈ ప్రాంతాల బందిపోటు దొంగల బెడద జాస్తి అని నేనూ విన్నాను. కాని, వాళ్ళు పట్టపగలే గ్రామాలమీదపడి దోచుకుపోతారని వినలేదు. మీ వాళ్లంతా ఏమయ్యారు?" అని అడిగాడు కాళీవర్మ.

"బందిపోట్లు రావటం చూస్తూనే అంతా తలొక దిక్కుకూ పారిపోయారు. వాళ్ళు గ్రామం వదలగానే ఒకళ్ళొకళ్ళు ఇళ్ళకు తిరిగి వస్తారు. ఇది మాకు మామూలే," అన్నాడు ముసలివాడు.

"ఈ బందిపోట్ల సంగతి రాజుగారికి తెలియపరచక పోయారా? ఆయన భటులను

పంపి, వాళ్ళను వేటాడించే వాడు,'' అన్నాడు కాళీవర్మ, రాజు సంగతి తెలిసి వుండీ, ముసలి వాడు ఏంజవాబిస్తాడో చూద్దామని.

తాత దిగులుగా ముఖం పెట్టి, ''కబురంప కుండానే రాజుగారి భటులు వచ్చి, మా పంటల్లో సగం ఎత్తుకుపోతారు. మిగిలిన సగం ఈ చుట్టుపక్కల కొండల్లో వుండే బందిపోట్లు దోచుకుపోతారు. రాజుగారికి ఈ సంగతి తెలియందికాదు,'' అన్నాడు.

అంతలో చెట్లచాటు నుంచి నలుగురు బందిపోటు దొంగలు ముందుకు వస్తూ, ''ఆహా! ముసలివాడు మహా బాగా చెప్పాడు. ఇక ముందు ముందు పండిన పంటల్లో రాజుగారి భాగం కూడా మేమే పుచ్చుకోబో తున్నాం,'' అంటూ కత్తులెత్తి, కాళీవర్మతో, ''కవచం, కత్తీ, గుర్రం-నీ వాలకం చూస్తూంటే, వెంట నాలుగు డబ్బులు మోసుకొస్తున్న వాడివిలాగే కనిపిస్తున్నావు. ఏదీ, ఆ డబ్బు సంచీ నేలమీద పెట్టి, నాలుగడుగులు వెనక్కు నడువు,'' అన్నారు.

కాళీవర్మ, దొంగల కేసి ఒకసారి తీవ్రంగా చూసి, గుర్రం దగ్గిరకుపోయి, దాని జీను నుంచి వేళ్ళాడుతున్న చిన్న రొట్టెల మూట లను తెచ్చి, నేల మీద పడవేసి, రెండడు గులు వెనక్కు నడిచాడు. దొంగల్లో ఒకడు ఆశగా ముందుకు వచ్చి, వంగి మూటను ఎత్తబోయేంతలో కాళీవర్మ చర్రున కత్తి దూసి, వాడి మెడను ఒక్కదెబ్బతో తెగవేసి, చప్పున ముందుకు దూకి, మరిద్దరు దొంగ లను కత్తితో గుండెల్లో పొడిచాడు.

నాలుగో దొంగ ప్రాణభీతితో పెద్దగా అరిచి పారిపోబోయేంతలో, కాళీవర్మ పరుగు పరుగునపోయి వాడి జుట్టు పట్టుకుని, నడుం మీద గట్టిగా ఒక తన్ను తన్ని, వాడు కూలబడగానే, బరబరా ముసలివాడి దగ్గి రకు ఈడ్చుకువచ్చాడు.



హఠాత్తుగా తన కళ్ళ ఎదుట ముగ్గురు దొంగలు హతం కావటం, నాలుగవవాడు కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ, చావు కేకలు ప్రారంభించటం చూసి, ముసలివాడు వణికి పోతూ, "నాయనా, ఏమి నీ సాహసం! మా గ్రామంలో నీ కన్న బలం గల యువకు లెంతమంది లేరు! వాళ్ళేనాడైనా తెగించి, ఈ బందిపోట్ల నెదుక్కొని, ఒక్కగానొక్కణ్ణ యినా చంపగలిగారా?'' అన్నాడు.

"ఆ పని మీవాళ్ళచేత నేను చేయించి గాని, రాజధానికి పోను. ఆకలి సంగతి తరవాత; ఈ రొట్టెలమూట పట్టుకుని, నువ్వు ముందుండి మీ గ్రామానికి దారితియ్యి. ఈ బందిపోటునూ, గుర్రాన్నీ నేను వెనకగా తీసుకువస్తాను,'' అన్నాడు కాళీవర్మ.



ముసలివాడూ, కాళీవర్మా అక్కణ్ణించి బయలుదేరబోయేంతలో, కొందరు గ్రామ స్థులు అక్కడికి రొప్పుతూ, రోస్తూ వచ్చి, "తాతా, ఏమైంది? ఆ చావుకేకలు పెట్టిందె వరు?'' అని అడిగారు.

కాళీవర్మ వాళ్ళకేసి అసహ్యపడుతూ చూసి, "మీలో గుడ్డివాళ్ళెవరూ వున్నట్టు లేదు. జరిగిం దేమిటో కనబడటం లేదా? గ్రామాల మీద పడి దోచుకునే బందిపోటు దొంగలను కలిసి కట్టుగా ఎదిరించటం పోయి పిరికిపందల్లా అరణ్యంలోకి పారి పోయే మీరు ఏం మను షులు?'' అన్నాడు.

ఆ మాటలకు అందరూ తలలు వంచు కున్నారు. ముసలివాడు, వాళ్ళకు జరిగిందే మిటో చెప్పి, "ఒరే, మన గ్రామంలోనే కాదు, చుట్టుపక్కల వున్న గ్రామాల్లోని నా బోటి ముసలి ముతక జనాన్ని వదిలేసి, మిగి లినవాళ్ళు, ఈ కుర్రవాడిని పెద్దగా చేసు కుని, కొండల్లోని బందిపోట్లను దుంప నాశనం చేయండి. పట్టపగలే కొంపా గోడూ వదలి, అరణ్యంలో ఎంతకాలమని తల దాచుకుంటాం? మనం మనుషులమా లేక లేళ్ళూ, కుందేళ్ళ లాంటి హీనజాతి జంతు వులమా?'' అన్నాడు కోపంతో నిలువెల్లా వణికిపోతూ.

కాళీవర్మ ఆ మాటలకు తృప్తిగా తలా డించి, "నే చెప్పాలనుకున్నది, మీ గ్రామ వృద్ధుడే చెప్పాడు. ఈ దొరికిన దొంగ ద్వారా, కొండల్లోని తతిమ్మా బందిపోట్ల స్థావరాలు తెలుకోవటం ఏమంత కష్టం కాదు. మీలో కత్తి, ఈటె పట్టగలవాళ్ళు, నా వెంట రండి. ఒక్క వారం రోజుల్లో బందిపోట్లనందర్నీ సర్వనాశనం చేసి, నా దారిన నేను పోతాను,'' అన్నాడు.

గ్రామస్థులు కాళీవర్మను సగౌరవంగా తమ గ్రామానికి తీసుకుపోయి విందు భోజనం పెట్టారు. కొందరు యువకులు దూర గ్రామా లకుపోయి, మరికొందరు యువకుల్ని తీసుకు వచ్చారు. కాళీవర్మ వాళ్ళకు బందిపోట్లను

ధైర్యంగా ఎలా ఎదుర్కోవాలో చెప్పాడు. దొరికిన బందిపోటు దొంగ అంతగా హింస పడకుం టానే కొండల్లోని ఏ గుహలో, లోయలో ఎంతెంత మంది బందిపోట్లు వున్నారో, అక్కడికి వెళ్ళేందుకు వున్న రహస్య మార్గా లేమిటో కాళీవర్మకు చెప్పేశాడు.

కాళీవర్మ గ్రామయువకుల్ని వెంట బెట్టుకుపోయి, హఠాత్తుగా దాడులు చేసి, చాలామంది బందిపోట్లను చంపాడు. చావగా మిగిలినవాళ్ళు రాజ్య సరిహద్దులు దాటి, కొండలకావలనున్న అరణ్యాల్లోకి పారిపోయారు.

బందిపోట్ల వేట ముగిసిపోగానే కాళీవర్మ తిరిగి రాజధానీ నగరానికి బయలుదేరాడు. పదిహేను రోజుల ప్రయాణం తరవాత అతడు అరణ్యందాటి, చంద్రశిలానగర పరిసరాలను చేరబోతూండగా, ఒకనాటి సూర్యోదయం వేళ, హఠాత్తుగా పదిమంది అశ్వికులు వచ్చి అతణ్ణి చుట్టుముట్టారు. కాళీవర్మకు, ఒర నుంచి కత్తిదూసేందుక్కూడా సమయం లేదు.

అశ్వికుల నాయకుడు, అతడికేసి కొరకొర చూస్తూ, "నువ్వు, కాళీవర్మవుకాదా? బంది పోట్లను రాజ్యసరిహద్దులలోని, అరణ్యాల నుంచి పొరుగు రాజ్యంలోకి పారదోలిన వాడివి, నువ్వేగదా?" అని అడిగాడు.

"అవును, ఆ పని చేసింది నేనే! గ్రామస్థు లకు బందిపోట్ల బెడద లేకుండా చేసిన నన్ను ఎంతో గౌరవంగా నగరానికి తీసుకు పోయి, రాజదర్శనం చేయించటానికి బదులు, ఇలా బందిపోటును చుట్టుముట్టి పట్టుకుం టున్నట్టు, పట్టుకోబోతున్నారేం?" అని అడి గాడు కాళీవర్మ ఆశ్చర్యపోతూ.

ఆ జవాబుకు అశ్వికుల నాయకుడు పెద్దగా నవ్వి, "నువ్వు, జితకేతు రాజుగారికి చేసిన ద్రోహం అంతా ఇంతా కాదు. ఇక్క ణ్ణించి పారిపోయిన దొంగలు పొరుగు రాజ్యంలో బందిపోట్లు ప్రారంభించారు. ఆ రాజు, మా రాజుగారే ఇందుక్కారణం అని, చంద్రశిలానగరం మీదికి దండెత్తి రాబోతు న్నాడు. ఈ గొడవకంతకూ కారణం అయిన నిన్ను, ఉరితీసి, శవాన్ని ఆ రాజుకు పంప బోతున్నాం," అన్నాడు.

"ఆ జితకేతు రాజుతోపాటు మీకూ మతులుపోయినయ్యా!" అంటూ కాళీవర్మ కత్తిపిడిమీద చేయి వేయబోయేంతలో, అశ్వి కులు హఠాత్తుగా అతడి మీదపడి కాళ్ళూ, చేతులూ కట్టి, గుర్రం మీదవేసి, ఉత్సాహంగా కేకలుపెడుతూ, నగరం కేసి బయలు దేరారు. – (ఇంకావుంది)





బేతాళ
కథలు

# వజ్రకంకణం

ట్టు వదలని విక్రమ
ర్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి
చెట్టుపై నుంచి శవాన్ని దించి
భుజాన వేసుకుని, ఎప్పటిలా
మౌనంగా శ్మశానం కేసి నడ
సాగాడు. అప్పుడు శవంలోని బేత
ళుడు, "రాజా, భరించరాని శ్రమ
లకు ఓరుస్తూ, అర్ధరాత్రివే
భయంకరమైన ఈ శ్మశానంలో కార
సిద్ధికోసం నువ్వు చూపుతున్న
పట్టుదల ఎంతయినా మెచ్చతగినదే
అయితే, అనుకున్న కార్యాన్ని సున
యాసంగా సాధించే అవకాశ
దానంతట అది వచ్చినా, ఆదిత్యుడిల
అనుకోకుండా ఎదురైన కష్టనష్టాలు
మానసిక బాధలు కారణంగా దాని
చేజేతులా జారవిడుచుకునే బుద్ధి
చాంచల్యం లేదా బుద్ధిమాంద్య
కొందరికి ప్రాప్తిస్తుంది. నీకు అలాంట



పరిస్థితి ఏర్పడకుండా తగు హెచ్చరికగా ఉండేందుకు ఆదిత్యుడనే ఆ యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

రత్నపురి రాజ్యంలోని మారుమూల గ్రామం వజ్రపురంలో నివసించే ఆదిత్యుడనే యువకుడు చురుకైనవాడు. తల్లిదండ్రుల పట్ల ఎనలేని ఆదరాభిమానాలు కనబరచేవాడు. తనకున్న కొద్దిపాటి పొలంలో రాత్రీ పగలూ కష్టపడి పని చేసేవాడు. అయితే, కష్టానికి తగ్గ ఫలితం దక్కేది కాదు. అతనికే కాదు; ఆ ఊళ్ళో నేలనే నమ్ముకున్న అతని తాత తండ్రులకు కూడా మిగిలింది ఏదీలేదు తరతరాల కాయకష్టం తప్ప.

వజ్రపురంలో సకాలంలో వానలు కురిస్తేనే పంటలు. ఒకవేళ పంటలు పండినా అవి భద్రంగా ఇల్లు చేరుతాయనే నమ్మకం లేదు. కారణం ఆ గ్రామాన్ని అనుకుని ఉన్న బాష్పధారానది. చుట్టూ కొండలతో ఎప్పుడూ ఎండిపోయి కనిపించే ఆనదిలో ఎప్పుడు వెల్లువ వస్తుందో ఎవరికీ తెలియదు. ఎగువ ఎక్కడో వర్షం కురిస్తే, హఠాత్తుగా వచ్చే వరదనీరు గ్రామాన్నీ, చుట్టు పక్కల పొలాలనూ ముంచెత్తేది! ప్రజలు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని విలవిలలాడిపోయేవారు.

నదికి అడ్డుగా ఆనకట్టకట్టి, గ్రామాన్ని వరద ప్రమాదం నుంచి కాపాడమని గ్రామ ప్రజలు-గ్రామాధికారి ద్వారా, రాజ ప్రతినిధుల ద్వారా ఎన్నోసార్లు రాజుకు విన్నవించుకున్నారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఎందుకో గాని రాజు వారి ప్రార్థనను పట్టించుకోలేదు.

ఉన్న ఊరు వదిలిపెట్టలేక ఆ గ్రామ ప్రజలు తరచూ కరువు కాటకాలతోనే కాలం గడపసాగారు.

ఆ సంవత్సరం అదునులో వర్షం కురవడంతో ఆదిత్యుడు అమితోత్సాహంతో తన పొలంలో వరి నాటాడు. పంట బాగా పండింది. కోసి కట్టలుగా కట్టి కల్లానికి చేర్చారు. బంగారం లాంటి వరి ధాన్యాన్ని కల్లంలో రాసి పోశారు. ధాన్యాన్ని రేపు ఇంటికి చేర్చాలని అన్నీ సిద్ధం చేసుకున్నారు. దురదృష్టవశాత్తు ఆ రాత్రే పొంగిన బాష్పధారానదివల్ల కల్లంలోని ధాన్యరాసులు కొట్టుకుపోయాయి. కల్లం దగ్గరి ఆవులూ, మేకలతో పాటు ధాన్యరాశులకు కాపలా ఉన్న ఆదిత్యుడి తల్లిదండ్రులు కూడా వరద ప్రవాహంలో కొట్టుకుపోయారు.

ఆ దృశ్యాన్ని చూసిన ఆదిత్యుడి గుండె విలవిలలాడింది. కన్నీరు మున్నీరుగా విల పించాడు.కన్నవాళ్ళను పోగొట్టుకున్న ఆది త్యుడికి ఇక ఆఊళ్ళో ఉండడానికి మన సొప్పలేదు. విరక్తితో అక్కడి నుంచి బయలుదేరాడు.

ఎటు వెళుతున్నామో కూడా తెలియ కుండా అన్యమనస్కంగా రెండురోజుల పాటు అడవిదారిలో నడిచాడు. మూడవ రోజు మధ్యాహ్నం ఒక మర్రిచెట్టు నీడలో కొంతసేపు విశ్రాంతి తీసుకుని, బయలు దేరే సమయంలో ఎదుట ఒక పొదలో ఏదో తళతళా మెరుస్తూ కనిపించింది. ఆది త్యుడు దానిని తీసిచూశాడు. అదొక వజ్ర కంకణం. అందులో రాజముద్రిక కూడా ఉంది. అతడు దానిని మళ్ళీ ఒకటి రెండు సార్లు అటూ ఇటూ తిప్పి పరిశీలనగా చూసి నిర్లిప్తంగా బట్టలలో దాచుకుని ముందుకు ప్రయాణం సాగించాడు.

ఆరోజు సాయంకాలానికి రాజధాని పొలి మేరలోని శశాంకపురం అనే పట్టణాన్ని చేరు కున్నాడు. అతడు ఒక ప్రధాన వీధిగుండా వెళుతూండగా, రచ్చబండ వద్ద రాజభటులు, "ప్రజలకు ఇదే ఆఖరు హెచ్చరిక! రేపటి లోగా రాజుగారి వజ్రకంకణంతెచ్చి అప్ప గించక పోతే మరణశిక్ష తప్పదు. రేపులోగా తెచ్చి అప్పగించి, కావలసిన బహుమతిని అందుకోండి!" అని చాటింపు వేయడం విన్నాడు.

ఆదిత్యుడు పక్కనున్న వారిని వివరాల డిగాడు. రాజుగారి వజ్రకంకణం కనిపిం చడం లేదనీ, తర తరాలుగా రత్నపురి



రాజ్యాన్ని పాలించిన తమ పూర్వులు ధరిం చిన కంకణం కావడం వల్ల, ప్రస్తుత రాజుగారికి దాని మీద అపార అభిమానం అనీ, అందుకే దానిని పౌర్ణమిలోగా తెచ్చి అప్ప గించిన వారికి కోరిన బహుమతి ఇస్తాననీ, అలా అప్పగించకపోతే, ఆ తరవాత దానిని వెతికించి పట్టుకుంటే, దాచిన వారికి మరణ శిక్ష తప్పదనీ చండ శాసనుడైన రాజు ఒకనెల రోజులుగా హెచ్చరిస్తున్నట్టు అక్కడి ప్రజలు వాడికి తెలియజేశారు.

ఆదిత్యుడు మరి రెండురోజులు ఆగి, మూడవరోజు రాజధానీ నగరం చేరుకుని, రాజును దర్శించి, నిండుసభలో వజ్ర కంకణాన్ని ఆయన ముందుంచాడు.

దానిని చూడగానే రాజు కళ్ళు ఆనం దంతో మెరిశాయి. ఆయన ఆదిత్యుడికేసి ఆశ్చర్యంగా చూస్తూ, "ఇది నీ కెప్పుడు ఎక్కడ దొరికింది?" అని అడిగాడు. "మూడు రోజుల క్రితం, శశాంకపురం సమీప



అడవి ప్రాంతంలో దొరికింది,'' అన్నాడు ఆదిత్యుడు వినయంగా.

''మరి ఆరోజే ఎందుకు తెచ్చి ఇవ్వలేదు? బహుమతి లభించేది కదా?'' అని అడిగాడు రాజు.

ఆదిత్యుడు సమాధానం చెప్పకుండా నిర్లిప్తంగా చూస్తూవుండి పోయాడు.

''పౌర్ణమి గడువుదాటాక కంకణం తెచ్చి ఇచ్చినవారికి శిక్ష ఏమిటో తెలుసుకదా?'' అని అడిగాడు రాజు కాస్తకటువుగా.

''తెలుసు,'' అన్నట్టు తల పంకించాడు ఆదిత్యుడు.

రాజు అమితాశ్చర్యంతో ఆదిత్యుడికేసి పరిశీలనగా కొంతసేపు చూసి, లేచి వచ్చి అతన్ని, ఆప్యాయంగా కౌగిలించుకుని ఏం కావాలో కోరుకోమన్నాడు.

ఆదిత్యుడు రాజుకు నమస్కరించి, ''మహారాజా! తమరాజ్యం దక్షిణాగ్రంలో వున్న వజ్రపుర గ్రామవాసిని నేను. ఆ గ్రామ ప్రజలు చాలా కాలంగా బాష్పధారానది కారణంగా కన్నీటి బతుకులు సాగిస్తున్నారు. పుట్టిన నేలమీది మమకారం కొద్దీ, వదిలివెళ్ళే ధైర్యం చాలక, గ్రామాన్ని వదిలిపెట్టలేకున్నారు. నదికి ఆనకట్ట నిర్మించమని తమకు పలుసార్లు మొరపెట్టుకున్నారు. ప్రస్తుతం మీరాజ్య పౌరుడిగా నాకర్తవ్యం నిర్వర్తించాను. ఈ రాజ్యేన్నేలే రాజుగా, ఆనకట్టను నిర్మించి మీ ధర్మాన్ని పాటించండి. మా గ్రామ ప్రజలూ, ముందు తరాల వాళ్ళూ తమపట్ల కృతజ్ఞులుగా ఉండగలరు. తమరు అనుమతిస్తే, ఇక సెలవు తీసుకుంటాను,'' అని సభనుంచి వెలుపలికి నడిచాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, గడువు ముగిసేలోపలే వజ్రకంకణాన్ని రాజుకు అప్పగించి, నదికి ఆనకట్టతో పాటు తన గ్రామానికి కావలసిన సదుపాయాలన్నిటినీ బహుమతిగా పొందే అవకాశాన్ని ఆదిత్యుడు ఎందుకు కావాలనే జారవిడుచుకున్నాడు? మరణశిక్ష పడుతుందని తెలిసీ, గడువు ముగిశాక వజ్రకంకణాన్ని తెచ్చి ఇవ్వడంలోని ఆంతర్యం ఏమిటి? ఉన్న ఆస్తి పాస్తులనూ, తల్లి దండ్రులనూ హఠాత్తుగా పోగొట్టుకోవడంతో అతడి మతి చలించిందా? చండశాసనుడైన రాజు, తన ఆజ్ఞను అతిక్రమించినందుకు ఆదిత్యుణ్ణి శిక్షించడానికి బదులు అభినందించడానికి గల కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీతల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఆదిత్యుడు, తన శ్రమను మాత్రమే నమ్ముకున్న నిజాయితీ పరుడు. అతడు స్వతహాగా మంచి వాడే తప్ప, తన మంచితనాన్ని ఇతరులు గుర్తించి, తద్వారా వారి నుంచి మెప్పు పొందాలనే కోరిక అతనిలో లవలేశం కూడా లేదు. గడువు ముగిసేలోపల వెళ్ళి ఇస్తే, బహుమతికి ఆశపడి తెచ్చిఇచ్చాడని ఇతరులు భావించవచ్చు. అందువల్లే గడువు దాటే వరకు అటువెళ్ళ లేదు. ఇక, గడువు ముగిశాక తెచ్చి ఇవ్వడానికి కారణం – అతడిది పరుల సొమ్ము ఆశించే స్వభావం కాదుగనక. జీవితం పట్ల విరక్తి కలిగిన వాడికి బహుమతులూ, శిక్షలూ తృణప్రాయాలు. అంతటి విరక్తిలోనూ అవకాశం లభించింది గనక, తన గ్రామ ప్రజల ఇక్కట్లను రాజు దృష్టికి తీసుకురావడం తన బాధ్యతగా భావించి, రాజుకు ప్రజలను ఆదుకోమని కర్తవ్యాన్ని గుర్తు చేశాడు. పుట్టి పెరిగిన గ్రామంపట్ల అతడి అభిమానాన్నీ, ఉపకారబుద్ధినీ అది చాటుతోంది. అతడిలోని నిజాయితీనీ , ధర్మబుద్ధినీ గ్రహించడంవల్లే రాజు అతన్ని ఆప్యాయంతో అభినందించాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. –(కల్పితం)

[ఆధారం: మంజు భారతి రచన]






# నాలుకపై తొలి పాఠాలు!

కాళిదాసు కథ మనకందరికీ తెలిసినదే. అమాయకుడైన ఒక గొర్రెల కాపరి, కాళికాదేవి శూలంతో నాలుకపై బీజాక్షరాలు లిఖించడంతో మహాకవి కాళిదాసుగా మారి, విక్రమాదిత్యుడి ఆస్థాన పండితులైన నవరత్నాలలో ఒకడుగా పేరుగాంచాడని చెబుతారు.

దేవీ నవరాత్రుల మరుసటి రోజైన విజయ దశమిని పరాశక్తి, మహిషాసురుణ్ణి సంహరించిన దానికి సంకేతంగా వివిధ రాష్ట్రాలలో ఉత్సవాలు జరుపుకుంటారు. విజయదశమి నాడు పిల్లలకు ప్రప్రథమంగా అక్షరాభ్యాసం చేయించడం కూడా మన సంప్రదాయం.

కేరళ రాష్ట్రంలో విజయదశమినాడు సరస్వతీ పూజచేసి పిల్లలకు అక్షరాభ్యాసం చేయిస్తారు. దీనిని 'విద్యారంభం' అంటారు. ఇటీవలి కాలంలో ఇది మరింత ప్రాముఖ్యతను సంతరించుకున్నది. విద్యారంభం జరిపించవలసిన పిల్లల పేర్లను కొన్ని దేవాలయాలు ముందుగానే నమోదు చేయించుకుంటాయి. పూజారులు, సుప్రసిద్ధులైన విద్యావేత్తలు, కళాకారులు గురువులుగా వ్యవహరించి పిల్లల నాలుకలమీద ఓం లేదా హరిశ్రీ లేదా అ అని బంగారు గంటంతో రాస్తారు. ఈ విద్యారంభ కార్యక్రమానికి ఆధ్యాత్మిక సంస్థలు విద్యారంగంలోని ప్రముఖులను ఆహ్వానిస్తాయి. గత సంవత్సరం కొడుంగల్లూరులోని ఒక మసీదు కూడా, ఇరుగు పొరుగు పిల్లలకు ఈ 'విద్యారంభం' కార్యక్రమం నిర్వహించడానికి పూనుకున్నది. పిల్లలు పలకల మీద అ ఆ లు రాయడానికి 'ముల్లా' సాయపడ్డాడు.



ఇటీవలి కాలం వరకు కొన్ని కుటుంబాలలో పిల్లలను తాతయ్య, లేదా మేనమామ ఒడిలో కూర్చో బెట్టుకుని పిల్లల చూపుడు వేలిలో నేలమీద పోసిన బియ్యం మీదో, ఇసుక మీదో ఓం ప్రథమంగా అ ఆ లను రాయించేవారు! ఇది చాలామందికి తెలిసే ఉంటుంది!

పురాణ గాథలు - 19

# ఒక ప్రతిఘటన!



ఒకానొకప్పుడు వారణాసీ రాజ్యాన్ని బ్రహ్మ దత్త కుమారుడనే యువకుడైన రాజు పరిపాలించేవాడు. ఆయన నిరాడంబర జీవితాన్ని గడుపుతూ, ప్రజలకు సుఖ సంతోషాలను కలిగించడానికే తన సమయాన్నంతా వినియోగించేవాడు. అధికారులు ప్రజల పట్ల ఎలా నడుచుకుంటున్నదీ తెలుసుకోవడానికి, తనకు విశ్వాస పాత్రులైన రాజోద్యోగులను గూఢచారులుగా నియమించాడు. ప్రజలపట్ల నిరంకుశ భావంతో దురుసుగానో, నిజాయితీ రహితంగానో ప్రవర్తించే అధికారులను, పిలిపించి సక్రమంగా నడుచుకోమని, హిత బోధచేసి పంపేవాడు. తప్పు చేసినవారు సరిదిద్దుకోవడానికి అవకాశం కల్పించేవాడు.

ఇంకా ప్రజల మధ్య అభిప్రాయ భేదాలు, ఘర్షణలు తలెత్తినప్పుడు వాటిని చర్చల ద్వారా, పరస్పర అవగాహన ద్వారా సుముఖంగా పరిష్కరించుకోవడానికి వారిని ప్రోత్సహించేవాడు. మంత్రులు స్వయంగా గ్రామాలకు వెళ్ళి, ప్రజల సమస్యలను చర్చించి, పరిష్కరించేవారు.

రాజు తీసుకున్న ఇలాంటి చర్యల పర్యవసానంగా కొన్నాళ్ళకు ప్రజల మధ్య సమస్యలు, పొరపొచ్చాలు, ఘర్షణలు అన్నవి తగ్గి, క్రమంగా అసలు లేకుండా సమసి పోయాయి. వారణాసీ రాజ్యం సుఖ శాంతులకు నిలయమయింది.

అయినప్పటికీ, రాజు తరచూ విశ్వాస పాత్రులైన తన అనుయాయులను పిలిచి, "మన పరిపాలనలో ప్రజలు ఏవైనా లోపాలు ఉన్నాయంటున్నారా?'' అని అడిగే వాడు. వారు లేదన్నా తృప్తి చెందకుండా, మారు వేషంతో ప్రజల మధ్యకు వెళ్ళి, సామాన్య



ప్రజల బాగోగులను స్వయంగా తెలుసు కునేవాడు. రాజ్యంలోని ప్రతి ఒక్కరూ రాజు ధర్మపాలనను కొనియాడేవారు.

రాజుకు ఒకనాడు, ''నగరం, దాని పరిసర ప్రాంత గ్రామాలలో నివసిస్తూన్న ప్రజల స్థితిగతుల గురించి నాకు కొంత వరకు తెలుసు. రాజ్య సరిహద్దు ప్రాంతాల లోని ప్రజలు ఎలా ఉన్నారో, ఏమో,'' అనే ఆలోచన వచ్చింది.

మరునాడే ఆయన రథం మీద సరిహద్దు ప్రాంతానికి బయలుదేరాడు. ప్రజలు లేని చోట వేగంగానూ, జనసమ్మర్దం ఉన్నచోట మెల్ల గానూ రథాన్ని నడిపిస్తూ, ప్రజల మాట లను ఆగి ఆలకిస్తూ చాలా దూరం వెళ్ళాడు.

సాయంకాలమయింది. రాజధానికి వెనుదిరగాలని అనుకున్నాడు. వారణాసి, కోసల రాజ్యాలకు మధ్య ఉభయ రాజ్యా లకూ చెందని భూభాగం కొద్దిగా వుంది. అది ఉభయ రాజ్యాల సరిహద్దును సూచి స్తుంది. రాజధానిని త్వరగా చేరుకోవచ్చు నన్న ఉద్దేశంతో, రథ సారథి జన సంచారం అంతగా లేని సరిహద్దు మార్గం గుండా రథాన్ని నడపసాగాడు. కొంతదూరం వెళ్ళాక మార్గం ఇరుకుగా తయారైంది. బాటకు ఇరువైపులా వాలు ప్రదేశాలు ఉన్నాయి. సారథి రథాన్ని మెల్లగా నడపసాగాడు. అయినా, ఉన్నట్టుండి వాళ్ళ రథానికి వేరొక రథం ఎదురుపడింది. ఒకదానికొకటి ఎదురె దురుగానూ, మార్గం మరీ ఇరుకుగానూ ఉండడంతో, రెండు రథాలూ ఆగి పోయాయి.

''మిత్రమా, దయచేసి కొంచెం వెనక్కు వెళ్ళి, మాకు దారి ఇవ్వు. రథంలో ఉన్నది కోసల మహారాజు మాలికుడు,'' అన్నాడు ఎదురుగావచ్చిన రథంలోని ఆ రథసారథి వినయంగా.

''మీ మహారాజుగారికి నా వందనాలు, మిత్రమా! ఈ రథంలో ఉన్నది వేరెవరో కాదు. సాక్షాత్తు వారణాసి నేలే బ్రహ్మదత్త కుమార మహారాజు. కాబట్టి, మీరే మాకు మార్గం ఇవ్వాలి!'' అన్నాడు వారణాసి రథసారథి.

''వారణాసి మహారాజుగారికి నా నమ స్కారం. అయినా, ఆయన మా రాజు కన్నా ఏ విషయంలో గొప్పవాడో ఎందుకు దారి ఇవ్వాలో నాకు తెలియడం లేదు,'' అన్నాడు కోసల సారథి చాలా నెమ్మదిగా.

''నీ మాటా నిజమే. వయసులో ఎవరు పెద్దవారో చూద్దాం. పెద్దలను గౌరవించడం మన సంప్రదాయం. పెద్దవారికి పిన్నలు

గౌరవంతో దారి ఇవ్వడం ధర్మం కదా?'' అన్నాడు వారణాసి సారథి.

కోసల సారథి అందుకు అంగీకరించాడు. కాని, ఇద్దరు రాజులూ సమ వయస్కులని తెలిసింది. ఆ తరవాత వంశ గౌరవాలను చూశారు. ఇరువురూ గొప్ప వంశాలకు చెందినవారే. వైశాల్యంలోనూ రెండు రాజ్యాలూ సమానంగా ఉన్నాయి. ఏ విధంగా చూసినా ఒకరికొకరు తీసిపోకుండా అన్ని విషయాలలోనూ సరిసమానంగా ఉన్నారు.

''మిత్రమా, మనరాజుల సంపదలనూ, వంశగౌరవాలనూ మరిచిపోదాం. రాజ్య పాలకులుగా ఇరువురినీ పోల్చి చూద్దాం. ప్రజల పట్ల మీ రాజు ఎలాంటి సిద్ధాంతాన్ని అనుసరిస్తాడో చెప్పగలవా?'' అన్నాడు వారణాసి సారథి.

''అలాగే,'' అంటూ కోసల సారథి ఇలా చెప్పాడు:

''దుష్టులపై కాఠిన్యం,
సాధు జనులపై కారుణ్యం,
మా రాజు సిద్ధాంతం;
మహోదాత్తం సర్వ వంద్యం!
మోసగాళ్ళకు భయావహం,
సత్యవంతులకు మలయమారుతం!
ఎక్కడున్నది ఇంతకన్న ఉత్తమ సిద్ధాంతం?''

''భలే, బాగా చెప్పావు. మా రాజు గురించీ కాస్త ఆలకించు మరి,'' అంటూ వారణాసి సారథి ఇలా అన్నాడు:

''దుష్టులను శాంతంతో, మోసగాళ్ళను ప్రేమతో జయిస్తాడు!
మృదువుగా మా వారణాసి మహా రాజు!
కరుణ, సత్యం ఆయన నయన ద్వయం!
అవని జనులందరికీ అమృతం ఆయన సిద్ధాంతం!!''

ఆ మాటలు విన్న మరుక్షణమే కోసల రాజు మాలికుడు రథం దిగి వచ్చి బ్రహ్మదత్త కుమారుడికి నమస్కరించాడు.

ఆ తరవాత వారణాసి రాజు కూడా దిగివచ్చి కోసల రాజును ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.

బోధిసత్వుడి పూర్వ జన్మలలో ఒకడైన బ్రహ్మదత్త కుమారుడు, మాలికుడి కోరిక మేరకు ఆదర్శపాలకుడికి ఉండవలసిన ఉత్తమ లక్షణాలను తెలియజేశాడు. ఇద్దరూ ఆప్త మిత్రులయ్యారు.

– బిందుసార్





# మరుగుజ్జురాక్షసి

ఒక అడవిదాపున చిన్నా పెద్ద కొండలతో, గుహలతోవున్న ప్రాంతాన ఉప్పలూరు అనే గ్రామం వుండేది. ఆ గ్రామంలో వున్న వీధి బడిలో చలపతి ఉద్యోగం చేస్తూండేవాడు. అతడికి ఈ మధ్యనే వివాహం అయింది. భార్య వకుళ చాలా అనుకూలవతి.

ఒక రోజున వకుళ, పక్కింటి పుల్లమ్మతో కలిసి, గ్రామాధికారి ఇంట పేరంటానికి బయలుదేరింది. ఆ సమయంలో పుల్లమ్మ వకుళతో, ''బొత్తిగా ఒంటిమీద చెప్పుకోతగ్గ ఒక్కనగాలేదు. చెవులకు కమ్మలయినా పెట్టుకో!'' అంటూ ఇనప్పెట్టెలోంచి, కొంత కాలంగా వాడకుండా వున్న కమ్మలు తీసి, వకుళ వద్దంటున్నా వినకుండా ఆమె చెవులకు పెట్టింది.

పేరంటం అయాక వకుళ ఇంటికి వచ్చి చూసుకుంటే, ఒక కమ్మలేదు. సీల వదులుగా వుండడంతో అదెక్కడో జారిపడి పోయింది. వకుళ, భర్త చలపతికి జరిగిందంతా చెప్పి ''పుల్లమ్మ ఎంత బలవంతం చేసినా కమ్మలు నేను పెట్టుకోవలసింది కాదు. ఎలాగైనా కొత్త కమ్మలు చేయించి పుల్లమ్మకు ఇవ్వాలి,'' అన్నది.

భార్య మాటలు వింటూనే చలపతికి గుండెల్లో రాయి పడినట్టయింది. కొత్తగా కాపరానికి వచ్చిన భార్య. తిట్టీ, కోప్పడీ ప్రయోజనం లేదు. ఎంతలేదన్నా కమ్మలకు వెయ్యి రూపాయలు కావాలి. ఎవరిని సాయం అడిగేట్టు? అని, ఆ పగలల్లా ఆలోచిస్తున్న చలపతికి, రాత్రి పొద్దుపోయినా నిద్రపట్టక, మంచం మీంచి లేచి తలుపు తీసి, పుచ్చపువ్వులా కాస్తున్న వెన్నెల్లో, కమ్మల గురించే ఆలోచిస్తూ, తానెటు పోతున్నదీ గమనించకుండా చాలా దూరం నడిచాడు.

చలపతికి హఠాత్తుగా తాను అడవి దాపులనున్న కొండగుహలకేసి వచ్చానేమో అన్న అనుమానం కలిగి, తలఎత్తి పరికించి చూశాడు. ఎదురుగా ఒక గుహబయట, ఒక మరుగుజ్జు రాక్షసి కూర్చొని వున్నది. అది చలపతిని చూస్తూనే, ''అర్ధరాత్రి

మాచిరాజు కామేశ్వరరావు

పౌర్ణమి వేళ ఇటు ఎందుకు వచ్చావు?'' అని అడిగింది.

రాక్షసిని చూస్తూనే భయకంపితుడై పోయిన చలపతి, మనసులో మననం చేస్తున్న కమ్మల సంగతిని, ''కమ్మలు! కమ్మలు!'' అంటూ బయటికి అనేశాడు.

మరుగుజ్జు రాక్షసి కాస్త ఆశ్చర్యపోయి, ''ఒక్క కమ్మలేమిటి? నా పెళ్ళికోసం మా అమ్మ ఇంకా చాలా నగలు పోగుచేసింది. ఒంటి మీద దిగేసుకున్న నగలైనాచూసి, ఎవడైనా రాక్షస కుర్రాడు నన్ను పెళ్ళాడ తాడని, అమ్మ ఆశ! కానీ, ప్రతి కుర్రవెధవా, ఒంటిమీది నగల కేసి ఆశగా చూసి, తర్వాత నా మరుగుజ్జు రూపం చూసి పెదాలు విరుస్తూ వెళ్ళిపోతున్నాడు. ఈ జన్మలో ఇకనాకు పెళ్ళంటూ జరగడం కల్ల! ఆ నగలేవో ఇస్తాను, మోసుకుపో!'' అంటూ నగలున్న గోతాం ఒకదానిని గుహలోంచి ఈడ్చుతూ తెచ్చి చలపతి ముందు పెట్టింది.

చలపతికి నోటమాట పెగలలేదు. అతడు మరుగుజ్జురాక్షసికేసి ఒక చిరు నవ్వు నవ్వి, గోతాం భుజాన వేసుకుని ఇంటిదారి పట్టాడు.

తన ఇంటి పక్కనే వున్న పుల్లమ్మ ఇంటిని దాటుకుని వస్తుండగా, కొట్టాంలో వున్న గేదెలకు గడ్డి వేయడానికి వచ్చిన పుల్లమ్మ ఆశ్చర్యపోయి, ''ఇంత అర్ధరాత్రి ఎక్కడికి పోయివస్తున్నావు, తమ్ముడూ? భుజం మీద ఆ గోతాం ఏమిటి?'' అని అడిగింది.

చలపతి ఆయాసపడుతూ, పుల్లమ్మ ఇంటి అరుగుమీద గోతాంలోని నగలు



గుమ్మరించి, అందులోంచి ఒక కమ్మల జత తీసి పుల్లమ్మకిస్తూ, ''నీ కమ్మ ఒకటి మా ఆవిడ పారేసుకున్నది. దానిబదులు ఈ జత కమ్మలు తీసుకో,'' అన్నాడు.

తర్వాత చలపతి నగలన్నీ తిరిగి గోతాంలోవేసి, నోటమాట రాక కళ్ళప్ప గించి చూస్తున్న పుల్లమ్మకు మరుగుజ్జు రాక్షసి గురించి సర్వం చెప్పి, తన ఇంటికి తిరిగి వచ్చాడు. భర్త చెప్పిందివిని, నిండు గోతాం నగలు కంటబడగానే, వకుళ కళ్ళు తేలవేసి, ''ఆ మాయదారి మరుగుజ్జు రాక్షసి పెళ్ళి నగలు మనకెందుకు? ఈ నగల సంగతి ఏ దొంగకో తెలిస్తే, ప్రాణాల మీదికి తెచ్చుకున్నట్టేగదా!'' అన్నది.

ఇంట్లో గోతాం నగలు వుండడంతో, ఆ రాత్రి చలపతీ, వకుళలకు కంటిమీద కునుకులేదు. పక్కింటి పుల్లమ్మ, చలపతి



అటు వెళ్ళగానే, భర్తను గట్టిగా తట్టి నిద్ర లేపి, సంగతి చెప్పి, "చప్పున మన ఒంటెద్దు బండిని సిద్ధంచేయి. గోతాం నగలు దానంగా ఇచ్చిన రాక్షసిదగ్గర ఒక బండెడు నగలు వుండితీరాలి!" అన్నది నమ్మకంగా.

ఆ భార్యాభర్తలు, మరుగుజ్జు రాక్షసి వున్న కొండ గుహచేరేసరికి, అక్కడ ఇంకా రాక్షసి విచారంగా కూర్చుని వున్నది. అది తాపీగా పుల్లమ్మ వచ్చిన పనేమిటో తెలుసుకుని, "నీ తెలివి ఏ తిరణాలో చూడబోయినట్టుంది! ఉన్న నగలన్నీ అతగాడెవడికో ఇచ్చేశాను. మా అమ్మ నేచేసిన పని తెలుసుకుని, నన్ను నానా చీవాట్లూ పెట్టింది. కోపంతో రగిలి పోతున్నది. గుహలోనే వున్నది. మీరు కంటబడితే నిలువునా చీరేస్తుంది. వెళ్ళిపొండి. ఆ నగలు తిరిగి తీసుకు వచ్చే దాకా, నన్ను గుహలో అడుగుపెట్టనివ్వనంది," అంటూ కళ్ళు తుడుచుకున్నది.

మరుగుజ్జురాక్షసి దగ్గర నగలేవీ లేవని విని నిరాశపడిపోయిన పుల్లమ్మ, రాక్షసితో, "నీ పెళ్ళి నగలన్నీ, మా పక్కింటి చలపతీ, వకుళా అనే మొగుడు పెళ్ళాల వద్ద వున్నవి. నావెంటరా, నీ నగలు నువ్వుతెచ్చుకుందువుగాని," అని సలహా ఇచ్చింది.

అందుకు రాక్షసి, "నాకు పగలు ప్రయాణం అంటే భయం. మనుషుల మధ్యకు రావడం అంటే మరీ భయం!" అన్నది.

పుల్లమ్మ ఒకక్షణం ఆలోచించి, "నువ్వు, నే వెంటతెచ్చిన గోతాంలో హాయిగా పడుకో, నేను గోతాం మూత బిగించి, బండి మీద తీసుకుపోయి, మా పశువుల కొట్టం గదిలో పెట్టి బయట తాళం వేస్తాను. నువ్వు అక్కడున్నట్టు ఎవరికీ తెలియదు. ఇంకా కొద్దిసేపట్లో తెల్లవారుతుంది గనక, రేపు రాత్రికి నిన్ను కొట్టం తలుపు తీసి వదులుతాను. పోయి ఆ చలపతినీ, అతగాడి పెళ్ళాన్నీ గోళ్ళతో రక్కి, పళ్ళతో కొరికి తగినశాస్తి చేసి, నీ నగలు నువ్వెత్తుకుపో. మీ అమ్మ చాలా సంతోషిస్తుంది," అని చెప్పింది.

మరుగుజ్జు రాక్షసి ఇందుకు సరే అని పుల్లమ్మ పశువులకొట్టం చేరింది.

చలపతిని ఆ రాత్రీ పగలూ కూడా జడుపుజ్వరం పట్టుకున్నది. వకుళ అతడికి ధైర్యం చెబుతూ, "ఏమైనా మీరు మరుగుజ్జు రాక్షసిని చేసిన మోసం ఏమీ లేదు. కానీ, పరధనం తాచుపాము లాంటిది.

నేనా నగల గోతాం ఆ కొండల దాకా మోయ లేను. కాస్త ఎండ తగ్గాక వెళ్ళి, చీకటి పడ్డాక ఆ రాక్షసినే వచ్చి తీసుకుపొమ్మని చెబు తాను,'' అన్నది.

చలపతి కలతనిద్రలో సరేనన్నట్టు తల వూపాడు. కొద్దిగా చీకట్లు కమ్ముతూండగా వకుళ నిర్భయంగా కొండగుహ దగ్గరకు వెళ్ళింది. ఆ సమయంలో, గుహముందు ఒకబండరాయిమీద ఒక భీకర స్వరూపిణి కూర్చుని, ''ఏమే, నా బంగారు మరుగుజ్జు తల్లీ! ఇంత కొప్పడినందుకు అంతగా కోపం తెచ్చుకుని గుహవదిలి ఎక్కడికి వెళ్ళావు? నీవులేని ఈ అడవీ, కొండలూ, గుహలూ ఎడారిలా కనిపిస్తున్నవి!'' అంటూ రోదిస్తున్నది.

వకుళ, రాక్షసిని సమీపించి, అమ్మతల్లీ! అంటూ నమస్కరించి, జరిగినదంతా చెప్పి, తన ఇంట వున్న నగలు తీసుకు పొమ్మన్నది.

రాక్షసి, వకుళను ఒకసారినిలువెల్లా పరి శీలనగాచూసి, ''ఆ పాపిష్ఠి నగల కోసమే, నా ముద్దుల తల్లిని తిట్టాను. ఆ తల్లి అలిగి కొండలుపట్టి ఎటోపోయింది. ఎన్ని బాధలు పడుతున్నదో ఏమో! నాకా పాపిష్ఠి నగలు వద్దనే వద్దు,'' అన్నది పెద్దగా మూలుగుతూ.

ఆ మాటలతో వకుళకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆమె, రాక్షసిని కొట్ట బోతున్నదానిలా చేతులు చాచి, ''నీ కూతురు పెళ్ళినగలు మాకొద్దని మరొక సారి చెబుతున్నాను. మాకష్టార్జితం మాకు చాలు. నీ కూతురు మరుగుజ్జు గనక, అటు రాక్షసుల మధ్యా దాగి వుండలేదు; ఇటు మనుషుల మధ్యా కలిసివుండలేదు. ఏదో ఒకనాడు తప్పక గుహ చేరుతుంది.



ముందు నా వెంటవచ్చి, నీ నగలు తీసుకు పో!'' అన్నది ఆజ్ఞాపిస్తున్నట్టు.

దానితో రాక్షసి మెత్తబడి ఇష్టం లేకపోయి నా వకుళవెంట బయలుదేరింది. వాళ్ళు గ్రామం చేరేసరికి, ఒక జాము రాత్రయింది. వకుళ ఇచ్చిన నగల గోతాం భుజాన వేసుకుని తిరుగుదారిపట్టింది తల్లిరాక్షసి.

ఆ సమయంలో, పుల్లమ్మ పశువుల కొట్టం గదిలో వున్న మరుగుజ్జు రాక్షసికి లోపల ఊపిరి ఆడడంలేదు. పైగా, దాహం, ఆకలి! అది గోతాంలో గిలగిల తన్నుకుంటూ, ''గోతాం మూతికట్టువిప్పి నన్ను బయటికి వదలండి! గది తలుపులు తెరవండి,'' అంటూ కొట్టంకప్పు ఎగిరిపోయేలా అరుపులు ప్రారంభించింది. నగల గోతాంను దూరంగా విసిరికొట్టి, కూతురి గొంతు గుర్తుపట్టిన తల్లిరాక్షసి ఆనందం పట్టలేక, ''వస్తున్నా, తల్లీ!'' అంటూ పరిగెత్తిపోయి, కొట్టం గది తలుపును ఒక్క మోచేతి పోటుతో బదాబదలు చేసి, కూతురున్న గోతాం మూతికట్టు తాళ్ళను గోళ్ళతో తెగగొట్టి, కూతురును భుజాన వేసుకుంటూ, ''అమ్మతల్లీ! ఎవరు నిన్నింత హింస పెట్టిన వాళ్ళు?'' అంటూ అడిగింది. ఊపిరి సరిగా పీల్చుకోలేక ఆయాసపడుతున్న మరుగుజ్జు రాక్షసి చేయెత్తి పక్కనేవున్న పుల్లమ్మ ఇల్లుచూపింది. ఆ వెంటనే తల్లిరాక్షసి రౌద్రంగా ఒకసారి హుంకరించి, మూసివున్న ఇంటి తలుపులను కాలితోతన్ని పడగొట్టి లోపల ప్రవేశించి, ''ఈ ఇంటి దుర్మార్గులెక్కడ?'' అంటూ కలయ చూసింది.

అది పుల్లమ్మ ఇల్లు ధ్వంసంచేసి, పుల్లమ్మను గోళ్ళతో రక్కి, పళ్ళతో కొరికి, వెలుపలికి వచ్చి, కూతుర్ని చంకలో వేసుకుని, ''ఈ దిక్కుమాలిన మనుషులకు మన నివాసం తెలిసిపోయింది. మనం వీళ్ళ మధ్య బతకలేం. మరేవైనా కొండదారులు చూసుకుందాం,'' అంటూ పెద్ద అంగలు వేసుకుంటూ, వకుళ నగల గోతాంను తీసుకువెళ్ళమని వెనకనుంచి పిలుస్తున్నా వినిపించుకోకుండా, వెళ్ళిపోయింది.

కుళ్ళుబోతు పుల్లమ్మ తనకు జరిగిన అవమానాన్ని భరించలేక, తన ముఖాన్ని నలుగురికీ చూపలేక, భర్తను వెంటబెట్టుకుని రాత్రికి రాత్రే ఊరు వదిలి వెళ్ళిపోయింది.



# ఆస్తికుడు - నాస్తికుడు

ధర్మయ్య, ధనయ్య ఎదురుబొదరు ఇళ్ళవాళ్ళు. ఇద్దరూ మంచి ఆస్తిపరులు. ఊహ తెలిసినప్పటి నుంచీ, ఇద్దరూ ప్రాణస్నేహితుల్లా కలిసిమెలిసి తిరిగేవారు. కానీ, ఇద్దరి ఆలోచనల్లో, ప్రవర్తనలో ఎక్కడా పొంతన వుండేది కాదు. ధర్మయ్య భక్తుడు, మనిషి జీవితంలో అనుభవించే కష్టసుఖాలన్నీ దైవనిర్ణయాలనేవాడు. కానీ, ధనయ్య అందుకు ఒప్పుకునేవాడు కాదు. ''సుఖాలిచ్చేవాడే కష్టాలు కూడా ఇవ్వడమేమిటి! ఆ దేవుడేమన్నా చపలచిత్తుడా?'' అనేవాడు.

''వానలు కురవడానికి దేవుడు కారణం,'' అని ధర్మయ్య అంటే, ''వానల్లేక వచ్చే కరువు కాటకాలక్కూడా కారణం ఆయనే అన్నమాట!'' అనేవాడు ధనయ్య.

''ప్రశాంతంగా పారే నదులూ, పరవళ్ళుతొక్కుతూ కిందికి దూకే జలపాతాలూ - ఇలా అన్నిటికీ, దేవుడు కారణం,'' అనేవాడు, ధర్మయ్య.

''మరి భూకంపాలకూ, ఉప్పెనలకూ, కారణం ఎవరు?'' అని అడిగేవాడు ధనయ్య.

ఇలా వాదులాడుకునే, ఆ ఇద్దరు మిత్రులకూ వార్ధక్యం మీదపడింది. మంచం పట్టారు. తుది శ్వాస విడిచే దశలోవున్న ధర్మయ్యను, స్వర్గలోకానికి తీసుకుపోవడానికి దేవదూతలు వచ్చారు.

ధర్మయ్య వాళ్ళకు నమస్కరించి, ''అయ్యలారా! నా ప్రాణస్నేహితుడు ధనయ్య ఎదురింటిలో వున్నాడు. వాడు నాస్తికుడు. వాడూ నాలాగే చావుబతుకుల మధ్య వున్నట్టు తెలిసింది. దేవుడున్నాడన్న నా మాటను తోసిపుచ్చేవాడు. వాణ్ణీ, నావెంట స్వర్గానికి తీసుకువెళ్ళండి. దేవుణ్ణి అక్కడ వాడు ప్రత్యక్షంగా చూశాకయినా, జ్ఞానోదయం కలుగుతుంది,'' అని కోరాడు.

దేవదూతలు అలాగే చేశారు. రత్నసింహాసనం మీద ధగద్ధగాయమానంగా వెలిగిపోతున్న దేవుణ్ణి చూసి, ధనయ్య, ''అవునా!'' అనుకుంటూ ఆశ్చర్యపోతున్నంతలో, ఒక మేఘగంభీర స్వరం, ''నాస్తికా! సంశయనివృత్తే గదా?'' అన్నది. ధనయ్య నిబ్బరంగా, ''కలడు కలండనెడి వాడు కలడు! కానీ, మానవలోకానికి సంబంధించినంతవరకు కేవలం నిర్గుణుడు, సాక్షీ భూతుడు మాత్రమే!'' అంటూ చేతులు జోడించి నమస్కరించాడు.



# మూడేళ్ళక్రితమే హెచ్చరించిన విద్యార్థిని!



తిరువనంతపురంలోని పాంగోడ్ కేంద్రీయ విద్యాలయంలో ఎస్.సారికా 11వ తరగతి చదువుతున్నది. మూడేళ్ళక్రితం ఆమె ఒక ఇంటర్‌స్కూల్ సైన్స్ ఎగ్జిబిషన్‌లో పాల్గొన్నది. ఆమె చేపట్టిన ప్రాజెక్ట్ : ''పెప్సి - ఒక ఆరోగ్య అవరోధం!'' ఈ విషయం ఇటీవలి కాలంలో అందరి దృష్టినీ ఆకర్షించిన సంగతి తెలిసినదే. అప్పుడు లభించిన కొన్ని వివరాల ఆధారంగా, సుప్రసిద్ధ శీతల పానీయాలలో దంతాలకు హానిచేసే పదార్థాలు ఉన్నాయని ఆమె హెచ్చరించింది.

గ్లాసెడు కోకోకోలాలో ఒక మనిషి చిన్న ప్రేవులను కమిలిపోయేలా చేయగల శక్తి వుందనీ, 500 మి.లి. కోలాలో 38 మి.గ్రాం కాఫిన్ ఉందనీ, ఒక స్త్రీ 300 మి.గ్రాం కాఫిన్ తీసుకుంటే ఆమెకు వంధ్యత్వం సంక్రమించే అపాయం ఉందనీ ఆమె తెలియజేసింది. 'డయెట్ పెప్సీ' ప్రచారకుడైన హాలీవుడ్ నటుడు మైకేల్ జె.ఫాక్స్ పార్కిన్‌సన్ వ్యాధిగ్రస్తుడైన విషయం సారికా ప్రేక్షకుల దృష్టికి తీసుకువచ్చింది. ఈ సంవత్సరం చెన్నయ్‌లో జరిగిన దక్షిణ మండల సైన్స్ ఎగ్జిబిషన్‌లో సారికా ప్రాజెక్ట్‌కు ప్రథమస్థానం లభించింది.

# పిన్నవయసు నేపథ్యగాయని !

మూడేళ్ళక్రితం, అంటే తన 11వ యేట సుభిక్షా రంగరాజన్ మొట్టమొదటిసారిగా సినిమా పాట పాడింది. లగాన్, పుకార్, డుం డుం మొదలైన చిత్రాలను చూసినవారు ఆమె కంఠస్వరాన్ని, ఇట్టే గుర్తుపట్టగలరు. ఈ సంవత్సర ప్రారంభంలో అమెరికాలోని కొలొరాడోలో జరిగిన 'యంగ్ మ్యూజిక్ అంబాసిడర్స్' కార్యక్రమంలో ఆమె ఇండియా తరఫున పాల్గొన్నది. ఆ తరవాత ఆమె తొలి ఆల్బమ్‌ను వెలువరించింది. హిందుస్థానీ, కర్నాటక ఉభయ సంగీత రీతుల్లోనూ ప్రావీణ్యం గల సుభిక్ష - ఇళయరాజా, కార్తిక్‌రాజా, యువన్ శంకర్ రాజా వంటి సుప్రసిద్ధ సంగీత దర్శకుల ఆధ్వర్యంలో ఎన్నో పాటలు పాడింది. ఆమె ఇప్పుడు 11వ తరగతిలో 'కామర్స్' చదువుతోంది!



# కరిగిన రాతిమనసు!



బబితా కుమారి, హర్యానా





కె.వి. నందన్, చెన్నయ్

వేసవికాల మధ్యాహ్న సమయం. సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. భూమి వేడి పెనంలా కాలిపోతున్నది. వేడి గాలులు ప్రాణులను వేధిస్తున్నాయి. ఈ గ్రామంలోని వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. తలుపులు మూసుకుని అందరూ ఇళ్ళల్లో నిద్రపోతున్నారు. కొందరు మాట్లాడుకుంటున్నారు.

ఆ గ్రామం చివరి పెంకుటింట్లో ఒక ముసలావిడ నివసిస్తున్నది. ఆమె కూడా తలుపులు మూసుకుని, రాట్నంలో నూలు వడుకుతున్నది. "ఘూమ్ ఘూ మేరు చర్ఖా మేరా కటా లంబా సూట్ అని పాడుతూ రాట్నంలో నూలు వడుకుతున్నది. ఆమె పక్కన కూర్చున్న పదేళ్ళ కుర్రాడు బామ్మకు ప్రత్తిని అందిస్తున్నాడు. ఆమె మనవడికి చర్ఖా గీతం పాడి వినిపిస్తున్నది.

ఉన్నట్టుండి ఎవరో దబ దబా తలుపు తట్టడం వినిపించింది. కుర్రవాడు బంతిలా లేచి వెళ్ళి తలుపు తెరిచాడు. దృఢకాయులైన నలు గురు యువకులు లోపలికి వచ్చారు.

"అవ్వా, బయట ఎండలు మండిపోతున్నాయి. కూర్చోవడానికి దరిదాపుల్లో ఒక్క చెట్టు కూడా లేదు. వడదెబ్బకు మా నాలుకలు పిడచకట్టుకుపోతున్నాయి. ఇంట్లో కాస్సేపు విశ్రాంతి తీసుకోవటానికి చోటివ్వు. ఎండ కాస్త తగ్గాక వెళ్ళిపోతాము,'' అన్నాడు వచ్చిన నలుగురిలో ఒక యువకుడు.

ఆమె ఆ యువకుడికేసి ఆశ్చర్యంగా చూసింది. వాడు చూడడానికి అచ్చు తన కొడుకు భోలు లాగే ఉన్నాడు. భోలు గత సంవత్సరం వడదెబ్బకు గురై మరణించాడు. లోపలికి వచ్చి మాట్లాడిన యువకుణ్ణి చూడగానే ఆమెకు చనిపోయిన తన కొడుకు గుర్తుకు వచ్చాడు.

"నాయనలారా, ఈ ఇల్లు మీ ఇల్లే అనుకుని కావలసినంత సేపు విశ్రాంతి తీసుకోండి,'' అన్నది ముసలావిడ. అలా అంటున్నప్పుడు ఆమె కనుకొలకులలో నీళ్ళు నిండాయి.

ఇంట్లో ఒక మూలగా యువకులు విశ్రాంతి తీసుకుంటూండగా, "ఎండలో పడి వచ్చారు. పాపం వాళ్ళు దాహంతో



ఉంటారు షర్బత్ చేసి ఇస్తాను,'' అనుకుంటూ లోపలికి వెళ్ళి పళ్ళరసం తయారుచేయసాగింది.

వచ్చినవారిపట్ల ఆ ముసలావిడ ఎంతో ప్రేమ చూపింది. అయితే, వచ్చిన యువకుల ఆలోచనలు దానికి పూర్తి విరుద్ధంగా ఉన్నాయి. వాళ్ళకు షర్బత్ ఇవ్వడానికి ముసలావిడ పైకి లేవగానే, ఆమె కొడుకును పోలి ఉన్న యువకుడు జేబునుంచి పిస్టల్ తీసి ఆమెకేసి గురి చూస్తూ తలుపు దగ్గర నిలబడి, ''అరిచావో, కాల్చి చంపేస్తాను,'' అని బెదిరించాడు కఠిన స్వరంతో.

ఆ దృశ్యాన్ని చూసి కుర్రవాడు హడలిపోయాడు. అయితే, ముసలావిడ ముఖంలో కించిత్తు కూడా భయం కనిపించలేదు.

పిస్టల్ గురిపెట్టిన యువకుడితో వచ్చిన వాడి మిత్రులు, ఇంట్లో వున్న నగలు, డబ్బులు అంటూ విలువైన వస్తువులన్నిటినీ అందినవి అందినట్టు తీసి మూట కట్టారు. ముసలావిడ వాళ్ళకేసి కొంతసేపు ప్రశాంతంగా చూసింది. ఆ తరవాత పిస్టల్ పట్టుకున్న యువకుడితో, ''నాయనా, నేను ఇంతకుముందే చెప్పాను కదా, ఇది నీ ఇల్లని. ఇల్లే నీదైనప్పుడు ఈ ఇంట్లో ఉన్నవన్నీ నీవే కదా! వాటినన్నిటినీ నువ్వు నిరభ్యంతరంగా తీసుకు వెళ్ళవచ్చు. అయితే మీ కోసం ప్రేమతో తయారు



చేసిన ఈ షర్బత్‌ను ఎవరు తాగగలరు? దీనిని తాగి దాహం తీర్చుకుని ఆ తర్వాత వెళ్ళండి,'' అన్నది.

ఆమె మాటలు యువకుల గుండెలకు తూటాల్లా తగిలాయి. వాళ్ళ రాయిలాంటి మనసులు కరిగిపోయాయి. వాళ్ళ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. యువకుడి చేతి నుంచి పిస్టల్ జారిపోయింది. వాడి కళ్ళ ముందు వృద్ధురాలైన వాడి తల్లి రూపం కదిలింది.

మరుక్షణమే నలుగురు యువకులూ ఆ ముసలావిడ పాదాలపైబడి క్షమించమని వేడుకున్నారు.

ఆమె మాత్రం అదే చెరగని చిరునవ్వుతో ప్రశాంతంగా చూస్తూ అలాగే ప్రేమమూర్తిలా నిలబడింది. ప్రేమ హింసను జయించింది!

కొడుకు : నాన్నా, నువ్వెప్పుడైనా ఈజిప్టుకు వెళ్ళావా?

తండ్రి : లేదు, నేనెప్పుడూ ఆ దేశం వెళ్ళలేదు.

కొడుకు : మరి, 'మమ్మీ'ని ఎక్కణ్ణించి తెచ్చావు?

సి. శ్రీజ (13)
తూత్తుకుడి

# గుణపాఠం



బి. స్వామినాథన్,
చెన్నయ్

''మణీ! ఏమిటా మొద్దు నిద్ర. బడికి వేళయింది. లే... లే...,'' అంటూ లేపింది మణి తల్లి.

మణికి మహా చిరాకేసింది. వాడికి బడికి వెళ్ళాలంటే మహాకష్టం. మరీ లెక్కల మేష్టారు నల్లశివం పిరియడ్ అంటే భయం కూడా.

''చదువూ, చదువూ అని వీళ్ళు ఎందుకిలా వేధిస్తారు? నేను ఇప్పటికిప్పుడే ఆఫీసర్ అయిపోవాలని వీళ్ళ ఆశ. ఎందుకంత పేరాశో, ఏమో...'' మణికి ఇలాంటి



ఆలోచనలే వచ్చేవి.వాడి తండ్రి కుప్పుసామి బట్టలు ఉతికేవాడు. అతనికి చదువు విలువ తెలుసు. తన కొడుకును బాగా చదివించి పెద్ద ఆఫీసర్ చేయాలన్నది అతని జీవితాశయం. ఆ లక్ష్యంతోనే అతడు రేయింబవళ్ళు కష్టపడుతున్నాడు.

అయితే మణికి చదువంటే ఇష్టం లేదు. ఈ విషయంలో తండ్రి కొడుకును తలుచుకుని దిగులు పడని రోజంటూ లేదు.

మణికి స్కూలుపట్ల ఉన్న విరక్తి రోజు రోజుకూ పెరగసాగింది. ఉపాధ్యాయుల మందలింపులు, శిక్షలు, సాటి విద్యార్థుల హేళనలు ఈ విరక్తిని మరింత పెంచాయి.

ఒకరోజు ఉదయం లేస్తూనే, ''నాన్నా, నేను రేపటి నుంచి బడికి వెళ్ళను, నీతో పాటు పనికి వస్తాను,'' అన్నాడు తండ్రితో దృఢనిర్ణయంతో.

కుప్పుసామి వెంటనే సమాధానం చెప్పలేదు. కొంతసేపు మౌనంగా ఊరుకున్నాడు. ఆ తరవాత, ''సరే, నీ ఇష్ట ప్రకారమే నాతో చాకిరేవుకు రా,'' అన్నాడు.

తండ్రి ప్రశాంత సమాధానానికి మణి ఆశ్చర్యపోయాడు. తను బడికి వెళ్ళనంటే, తండ్రి కొడతాడనీ, లేదా గట్టిగా తిడతాడనీ వాడు ఎదురు చూశాడు.

మరునాడు మణి, తండ్రి గాడిదను తోలుకుని తండ్రితో పాటు మెల్లగా చాకిరేవుకు నడిచాడు. ఇప్పటికి బడి చాకిరీ నుంచి విడుదల లభించినందుకు మన





నేహా అడిగా,
బెంగుళూరు



సులో చాలా సంతోషించాడు.

చాకిరేవులో అంత కష్టమైన పని ఏం ఉంటుంది? తెచ్చిన బట్టలను నీళ్ళలో తడపడం, బండకేసి నాలుగు ఉతుకులు ఉతకడం, ఎండలో ఆరబెట్టి మడిచి గాడిదమీద వేసి పట్టుకెళ్ళడం. అంతే కదా, అని వాడు అనుకోసాగాడు.

అయితే, నిజానికి బట్టలుతికే పని అంత సులభం కాదని మణికి కొద్దిసేపటికే అర్థం కాసాగింది. బట్టల నుంచి మురికి వదలగొట్టే లోపల నడుము విరిగిపోతున్నది. వాటిని ఎండబెట్టడం మరొక విన్యాసం. వీటికి తోడు గాడిదను దారిలో పెట్టడం ఇంకొక పోరాటం. బట్టలుతికే వారి బతుకు అమిత కష్టమైనదని వాడు గ్రహించాడు. తనను చదివించడం కోసం తన తండ్రి రోజూ ఎలా కష్టపడుతున్నదీ వాడు కళ్ళారా చూశాడు. ఇన్ని కష్టాలు పడడంకన్నా బడిలో బుద్ధిగా చదువుకోవడం ఎంత సులభమో వాడికి అర్థం అయ్యింది.

"నాన్నా, రేపటి నుంచి నేను బడికి వెళ్ళి బుద్ధిగా చదువుకుని, మీరు ఆశించినట్టే ఆఫీసర్‌ని అవుతాను," అన్నాడు మణి తండ్రితో.

కుప్పుసామి ఆనంద భాష్పాలతో కొడుకును కౌగిలించుకుంటూ, "నువ్వు నా కలను తప్పక నిజం చేయగలవు. నువ్వు నా బిడ్డవు కదా మరి!" అన్నాడు.

"అవునూ, నేను బడికి వెళ్ళనని చెప్పినప్పుడు మీరు నన్నెందుకు మందలించి వెళ్ళమనలేదు? నాలుగు దెబ్బలు వేసయినా పంపి ఉండవచ్చు కదా?" అని అడిగాడు మణి.

"నిజమే. అలా చేసి ఉండొచ్చు. అయితే, నేను అలా చేసి ఉంటే బడి పట్ల నీకున్న విరక్తి మరింత పెరిగేదే తప్ప తగ్గి ఉండదు. చదువు మరింత భారంగా అనిపించి ఉంటుంది. ఇప్పుడు నువ్వు ఇక్కడి కష్టాలను చూసి ప్రత్యక్షంగా అనుభవించి స్వయంగా చదవాలని నిర్ణయించావు గనక, తప్పక బాగా చదవగలవు. ఇది అనుభవం ద్వారా గడించిన గుణపాఠం. నువ్వు బాగా చదివి గొప్ప అధికారివి కాగలవనడంలో నాకెలాంటి సందేహమూ లేదు," అన్నాడు కుప్పుసామి.

మణి సంతోషంగా ఎంతో ఆత్మవిశ్వాసంతో ఇంటికి బయలుదేరాడు.





# యువరాణి - బంగారు పక్షి



కృత్తికా
సుగవనం,
చెన్నయ్

ఒకానొకప్పుడు సుఖవర్మ అనే రాజు సింధూర రాజ్యాన్ని పరిపాలించేవాడు. ఆయన ఏకైక కుమార్తె సుహాసిని. రాజ్యంలో ప్రజలందరూ సుఖ సంతోషాలతో జీవించేవారు. సహాసిని తన అందమైన నవ్వుతో అందరికీ ఆనందాన్ని పంచేది. ఆమె ఎప్పుడూ సుందర వనాలూ, తటాకాలూ, నదీ తీరాలు అంటూ ప్రకృతి అందాలను చూడడానికి, అమితాసక్తిని కనబరచేది.

రాజు సుఖవర్మ రోజూ సభ చేసి ప్రజల సమస్యలను పరిష్కరించేవాడు. ఇరుగు పొరుగు రాజులు ఆయనకు కానుకలు పంపేవారు. మరికొందరు దూతల ద్వారా సందేశాలు పంపేవారు. ఒకనాడు పొరుగు రాజైన ప్రతాపుడు ఒక దూతను పంపాడు.

సుఖవర్మ అభిమానం పొందాలని ఆశించిన ప్రతాపుడు ఆయనకు చక్కని కానుక పంపాలని నిర్ణయించాడు. తను పంపే కానుక ముందెన్నడూ ఎవ్వరూ ఇవ్వని అపూర్వ కానుకగా ఉండాలని ప్రతాపుడు భావించాడు. అందువల్ల సుఖవర్మకు ఎలాంటి కానుక కావాలో తెలియజేయమని దూత ద్వారా ఒక లేఖ పంపాడు. సుఖవర్మ ఆ లేఖను చూసి చాలా సంతోషించి, తన కుమార్తెకు ఆనందం కలిగించే కానుకను పంపమని తెలియజేశాడు.

యువరాణి సుహాసినికి ఆనందం కలిగించే కానుక ఏదో తెలుసుకుని రమ్మని, ప్రతాపుడు తన గూఢచారులు కొందరిని పంపాడు. యువరాణికి జంతువులన్నా, పక్షులన్నా అమితమైన ప్రేమ అని ఆయనకు తెలియవచ్చింది.







పునీత్ జె.
హిరేమత్,
బెంగుళూరు

అందువల్ల ఆయన యువరాణికి, ఆమె ఎప్పుడూ కనీవినీ ఎరుగని కానుకను పంపాడు. దానిని చూడడానికి రాజధానిలోని ప్రజలందరూ అమితోత్సాహం చూపారు. ప్రతాపుడు పంపిన కానుక ఒక బంగారు పంజరంలో అందమైన బంగారు పక్షి! యువరాణి దానిని అమితాశ్చర్యంతో చూసింది.

చెలికత్తె దానిని ఆమె క్రీడా ప్రాంగణానికి తీసుకువెళ్ళి, పంజరాన్ని ఒక మూలగా వేలాడగట్టింది. యువరాణికి ఆడుకోవాలని తోచినప్పుడు పంజరంతలుపు తీసేవారు. పక్షి వెలుపలికి వచ్చేది. ఆడుకున్నాక పక్షి మళ్ళీ పంజరంలోకి వెళ్ళిపోయేది. కొన్నాళ్ళకే పక్షీ, యువరాణీ మంచి మిత్రులైపోయారు. యువరాణి చేయి ఊపగానే, పక్షి పంజరంలోకి వెళ్ళేది. రమ్మన్నప్పుడు వచ్చేది.



అయితే, మరి కొన్నాళ్ళకు పక్షికి ఆటల పట్ల ఆసక్తి తగ్గిపోయింది. యువరాణి పక్షిలో వచ్చిన ఈ మార్పును గమనించింది. చెలికత్తెను కారణం అడిగింది. మనుషుల్లాగే పక్షులు కూడా వెలుపలి పరిసరాలనే కోరుకుంటాయనీ, పంజరాల్లో ఉండడం కన్నా, బయట ఎగరడానికే ఇష్టపడతాయనీ చెలికత్తె తెలియజేసింది.

అందువల్ల సుహాసిని దానిని ఉద్యానవనంలోకి తీసుకువెళ్ళింది. పక్షి ఉత్సాహంతో తిరిగి వచ్చింది. మళ్ళీ యువరాణితో ఆడుకోవడం ప్రారంభించింది. సుహాసిని చాలా సంతోషించింది. అయితే, మరికొన్నాళ్ళకు పక్షి మళ్ళీ విచారంగా కనిపించడంతో యువరాణి చెలికత్తెను కారణం అడిగింది. పక్షికి పంజరంలో ఉండడం ఇష్టంలేదు. అందుకే విచారంగా ఉన్నదని చెలికత్తె చెప్పింది. అయితే, పక్షిని అలా వదిలిపెడితే తిరిగి రాకుండా అలాగే ఎగిరిపోతుందేమో అని సుహాసిని అనుమానించి చెలికత్తె మాటను పెడచెవిని పెట్టింది.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు యువ



రాణి క్రీడా ప్రాంగణానికి వచ్చి బంగారు పక్షి కోసం పంజరంలోకి చూసింది. పక్షి చచ్చిపడి ఉంది. యువరాణికి తీరని విచారం పట్టుకున్నది. ఆ క్షణం నుంచి నవ్వడం మానివేసింది. రాజు వైద్యులను పిలిపించి, చనిపోయిన పక్షికి ప్రాణం పోయడం సాధ్యమవుతుందేమో అని అడిగాడు. అసాధ్యం అన్నారు వైద్యులు. అయితే, అలాంటి పక్షినే ఇంకొకదాన్ని తెప్పిస్తే యువరాణి విచారం మటుమాయం కాగల

> ఉపాధ్యాయిని : రాజూ, హిమాలయాలు ఎక్కడున్నాయి?
>
> రాజు : నాకు తెలియదు మేడమ్.
>
> ఉపాధ్యాయిని : బెంచీపై నిలబడు.
>
> రాజు : నిలబడ్డా, అవి కనిపించడం లేదు మేడమ్!
>
> కౌసల్య ఎస్ (11)
> బెంగుళూరు.

దని వైద్యులు రాజుకు సలహా ఇచ్చారు.

రాజు అలాంటి పక్షి కోసంరాజ్యమంతటా వెతికించారు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆఖరికి అలాంటి పక్షి మరొకటి కావాలని



పొరుగు రాజు ప్రతాపుడికి లేఖ పంపాడు. ప్రతాపుడు సంతోషంగా మరొక బంగారుపక్షిని, బంగారు పంజరంతో దూత ద్వారా పంపాడు.

యువరాణి సుహాసిని ఆ పక్షిని చూడగానే నవ్వింది. చనిపోయిన పక్షికే ఒక మాంత్రికుడు ప్రాణం పోసినట్టు రాజు ఆమెకు చెప్పాడు. ఆమె ఆనందానికి అవధులు లేకుండా పోయింది. తన బంగారు పక్షి ప్రాణంతో రెక్కలల్లార్చడం చూసి ఆమె మనసు మురిసింది.

అయితే, పక్షికి కావలసింది స్వేచ్ఛ అని యువరాణి ఇప్పుడు గ్రహించింది. బంగారు పంజరంలో పక్షిని తీసుకుని సమీప అరణ్యానికి వెళ్ళి అక్కడ వదిలిపెట్టింది. బంగారు పంజరాన్ని ఒక చెట్టుకు వేలాడగట్టి రాజ భవనానికి తిరిగి వచ్చింది.



# చిలికా సరస్సు



ఒరిస్సా తీర ప్రాంతంలో చిలికా సరస్సు. ఒకవైపు నిర్విరామంగా ఘోషించే సముద్రం. దాని పక్కనే ప్రశాంతమైన సరస్సు. గట్టున నిలబడి తల పైకెత్తి చూస్తే- ఆకాశం అనుక్షణం రంగులు మారుస్తూ ఉంటుంది. ఒక్కొక్కసారి నయనానందకరమైన రంగురంగుల దృశ్యాలు ఆవిష్కరించబడతాయి. వాటిని నేలమీది ప్రశాంత జలాలు ప్రతిబింబిస్తాయి. వాటిని చూస్తున్నప్పుడు మనం కలల లోకంలో విహరిస్తున్నామా, లేక కట్టెదుట నిజమైన దృశ్యాలను చూస్తున్నామా అన్న అనుమానం మనలో కలుగుతుంది. మనం ఆ దృశ్యాలతో తాదాత్మ్యం చెందుతామన్న మాట. అలా తాదాత్మ్యం చెందినప్పుడు, మనం స్వాతంత్ర్యం, అనంత సాహసానుభూతులను అనుభవించగలుగుతాము. ఎందుకంటే, గుణాల సంకేతాలకు స్పందించటానికి మనం అక్కడ సంసిద్ధులమవుతాము!

బంగ్లాదేశ్, నేపాల్ వంటి ఇరుగుపొరుగు దేశాల నుంచే కాదు; ఆస్ట్రేలియా, సైబీరియా మొదలైన సుదూర తీరాల నుంచి రకరకాల పక్షులు ఇక్కడికి తరలివస్తాయి. ఏటేటా శీతాకాలం ఆరంభం కావడానికి కాస్త ముందుగా అవి ఎంతగానో ప్రేమించే ఈ గొప్ప సరస్సుకు చేరుకుంటాయి. పల్లెలూ, పట్టణాలూ, కొండలూ కోనలూ, నదీనదాలూ దాటుకుని వేలాది మైళ్ళు ప్రయాణం చేసి వస్తాయి. అనంత గగన తలంలో అవి తమ గమన స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుంటున్నాయి. అతి పెద్దదీ, ప్రాచీనమైనదీ అయిన ఈ సరస్సు సాదరంగా ఆశ్రయం ఇవ్వగలదన్న ఆశతో, సరస్సు చుట్టూ వున్న మనుషులు తమకెలాంటి హానీ తలపెట్టరన్న ప్రగాఢ విశ్వాసంతో అవి అంత దూరం ఎగిరి వస్తున్నాయి. అరుదుగా ఎప్పుడైనా తమలో ఎవరైనా చంపబడి తమ నమ్మకం వమ్మయినప్పుడు తీవ్ర సంతాపానికి లోనవుతాయి. అయినా, త్వరలోనే కోలుకుని మనిషి మీద మళ్ళీ నమ్మకాన్ని పెంచుకుంటాయి. తమ ఆశా



భావం నుంచి మనుషులు కూడా ఎంతో కొంత నేర్చుకోవాలని కోరుకుంటాయి.

ఇవన్నీ ఒరిస్సాలో వున్న భారతదేశంలోనే అతి పెద్దదైన చిలికా సరస్సులో జరుగుతాయి. రాష్ట్ర రాజధాని భువనేశ్వర్‌కు 100కి.మీ. దూరంలో ఉన్నదీ సరస్సు. దీని వైశాల్యం దాదాపు 1,200 చ.కి.మీ. ఈ ప్రకృతి అద్భుతానికి బహుముఖాలున్నాయి. ఇంతవరకు మనం చెప్పుకున్నది ప్రశాంతమైన ఒక్క పార్శ్వం గురించే. తుఫాను సమయంలో సువిశాల ఈ జలఖండం - ఉవ్వెత్తున ఎగిసిపడే అలల తాకిడికి, ఎండమావుల్లా కనిపించీ కనిపించకుండా పోయే అసంఖ్యాకమైన దాని దీవులలో ఉన్న కొండలూ, కుటీరాలూ భయాద్భుత దృశ్యాలను సృష్టిస్తాయి.

వెన్నెల రాత్రులలో అదొక సుందర స్వప్నలోకంలా కనిపిస్తుంది. సరస్సు నీలి ఉపరితలం విచిత్ర వర్ణాలను పులుముకుంటే, దాని మీది అసంఖ్యాకమైన నురగలు బంగారపు కాంతులు విరజిమ్ముతూ సుందర స్వప్న లోకాలను స్ఫురింపజేస్తాయి.

## వినీల తటాకం

1,100 చ.కి.మీ. పైగా విస్తరించి ఉన్న చిలికా సరస్సు మన దేశంలోని అతి పెద్ద ఉప్పునీళ్ళ తటాకం. ఇందులో చాలా దీవులు ఉన్నాయి. ఈ తటాకంలో రకరకాల జల జంతు జాలాలూ; పక్షులూ చెట్లపై ఉన్నాయి. విల్లు ఆకారంలో ఉన్న ఈ సరస్సు చుట్టూ కొండలున్నాయి. ఆకాశంలో తేలే మేఘాలు, ఎండను బట్టి వీటి రంగులు మారుతూ ఉంటాయి. ఒరిస్సా రాష్ట్రంలోని సముద్ర తీర జిల్లాలైన పూరీ, ఖుర్దా, గంజాం జిల్లాలలో ఇది విస్తరించి ఉన్నది. బంగాళాఖాతం సన్నటి మార్గం గుండా భూభాగంలోకి చొచ్చుకు రావడం వల్ల బ్రహ్మాండమైన ఉప్పునీటి తటాకం ఏర్పడింది.

ఈ సరస్సులోని ప్రశాంత జలాలు విభిన్నమైన జంతు పక్షి జాలాలకు ఆశ్రయమిస్తున్నది. ఆసియాలో చాలా అరుదుగా కనిపించే డోవిచెర్, స్పూన్‌బిల్, శాండ్‌పైపర్ లాంటి 150 జాతుల పక్షులు ఇక్కడ ఉన్నాయి. అందుకే చిలికా సరస్సును 1987వ సంవత్సరంలో అభయాలయంగా ప్రకటించారు.



సరస్సులోనివి ఉప్పునీళ్ళని అంటారు. అయితే, అది పూర్తి వాస్తవం కాదు. దయా, భార్గవి, లూనా, గంధవతి నదులు పొంగి ఈ సరస్సులో సంగమించే కాలమూ ఉంది. ఆ సమయంలో నదీజలాలు సరస్సులోని ఉప్పునీళ్ళను చాలా వరకు సముద్రంలోకి కొట్టుకుపోతాయి. అయినా, నీళ్ళు ఉప్పు కావచ్చుగానీ, చిలికా సరస్సు హృదయం మాత్రం ఉప్పుకాదని అందరికీ తెలుసు. ఎందుకంటే, ఆ సరస్సులోని ప్రధానమైన దీవి కాళీజెయ్‌లోని బావిలో తియ్యటి నీళ్ళూరుతున్నాయి!

అయితే, ఈ సరస్సులో ఉన్నవి ఉప్పునీళ్ళే. ఇది సముద్రం కారణంగా ఏర్పడినది గనక, ఇందులోని నీళ్ళు ఉప్పగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఇది సముద్రంతో కలిసి ఉండడం వల్ల సముద్రంలోని రకరకాల చేపలు, రొయ్యలు ఇందులోకి చేరి, చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలకు జీవనోపాధిని కలిగిస్తున్నాయి. దాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం ఏదో ప్రకృతి ఉత్పాతం వాటిల్లి, ఈ సరస్సు సముద్రం నుంచి వేరుపడి ఉంటుందని భావిస్తున్నారు. రెండు వైపులా నిలబడి వున్న కొండల బారులు సరస్సుకూ, సముద్రానికీ మధ్య ఉన్న సంబంధాన్ని చాటుతున్నాయి.



అయితే, ఈ సరస్సు పుట్టుకను గురించి జానపదుల మధ్య ఒక కథ ప్రచారంలో ఉంది. ఒకానొకప్పుడు ఓడ దొంగలో, దురాక్రమణదారులో పూరీ జగన్నాథ మందిరాన్ని కొల్లగొట్టడానికి వచ్చి సముద్ర తీరాన దిగారు. సంగతి గ్రహించిన దేవాలయ పూజారులు - ఆలయంలోని విగ్రహాలనూ, విలువైన ఆభరణాలనూ తీసుకుని సురక్షిత ప్రాంతానికి వెళ్ళిపోయారు. దానిని చూసి నగర ప్రజలు కూడా నగరాన్ని వదిలి వెళ్ళిపోయారు.

ఎన్నో ఆశలతో వచ్చిన ఓడ దొంగలకు ఏదీ దొరకలేదు!

మనం అర్ధరాత్రి సమయంలో అతి రహస్యంగా వచ్చాం కదా? మరి ఆ సంగతి పూజారులకు ఎలా తెలిసి ఉంటుందా అని దొంగలు ఆశ్చర్యంతో ఆలోచించసాగారు. దొంగల రాకను సముద్రమే తన ఘోషతో పూజారులను హెచ్చరించిందనీ, సముద్ర ఘోషను అర్థం చేసుకునే శక్తి ఒక పూజారికి ఉన్నదనీ, దొంగ ఒకడు తమ ముఠానాయకుడికి చెప్పాడు.



సైబీరియా లాంటి సుదూర ప్రాంతాల నుంచి వేల సంఖ్యలో రకరకాల పక్షులు వలస రావడంతో చిలికా సరస్సు శీతాకాలంలో నయనానందకరంగా కనిపిస్తుంది. చుట్టుపక్కల నున్న కొండలలో ఇసుక పర్రలలో నల్ల జింకలు, కోతులు, చేపలు పట్టే పిల్లులు, ముంగిసలు, ముళ్ళపందులు మొదలైన జంతువులు ఉన్నాయి. సముద్రం దాపుల నున్న పొదలలో పాములు, తాబేళ్ళు, తొండలు ఉన్నాయి. సరస్సు సముద్రంలో కలిసే సత్పార దీవిలో డాల్ఫిన్స్ కూడా కనిపిస్తాయి.

పెద్ద ద్వీపాలలో ఒకటైన నల్బానాలో 10 కి.మీ. వైశాల్యంలో ఊబి ఉంది. అది రుతుపవనాల సమయంలో నాలుగైదు నెలలు మునిగే ఉంటుంది. డాల్ఫిన్స్, టర్న్ గబ్బిలాలు, ఎలుగుబంట్లతో పాటు ఇక్కడ తాబేళ్ళు, పాములు కూడా ఉన్నాయి.

ఇక్కడ 150 జాతుల చేపలు, రొయ్యలు నమోదు చేయబడి ఉన్నాయి. బారాకుడియా ద్వీపంలో 1917వ సం లో అరుదైన కాళ్ళు లేని తొండ కనుగొనబడింది.

ఇక్కడ బోటింగ్ క్రూయిసింగ్ సౌకర్యాలు ఉన్నాయి. బారాకుడ్‌లో ఒరిస్సా పర్యాటక శాఖ జలక్రీడలు కూడా ఏర్పాటు చేస్తోంది.



దొంగలు తీరం నుంచి ఓడలలోకి వెళ్ళే ముందు, సముద్రాన్ని కసితీరా తిట్టి, శాపనార్థాలు పెట్టారు. అంతే, ఆగ్రహించిన సముద్రం - కొండలలాంటి అలలతో పైకి లేచి దొంగల ఓడలను అల్లకల్లోల పరిచింది. ఓడలు ఛిన్నాభిన్నమై మునిగిపోయాయి. దొంగల జాడ కనిపించలేదు. ఆ తరవాత సముద్రం శాంతించి మామూలు స్థితికి వచ్చింది. అయితే, ప్రజాక్షేమం కాంక్షించి, జలంలో కొంత భాగాన్ని శాశ్వతంగా అక్కడే వదిలి వెళ్ళింది. అదే ఈ విశాల జలాశయం!

కొన్ని శతాబ్దాలకు పూర్వం ఈ సరస్సు ఇప్పటికన్నా చాలా పెద్దదిగా ఉండేది. అది ఒక ఓడరేవుగా ఉండేది. దూర దేశాల నుంచి ఓడల రాకపోకలు సాగేవి. క్రీ.పూ. 4వ శతాబ్దంలో భారతదేశాన్ని సందర్శించిన సుప్రసిద్ధ గ్రీకు యాత్రికుడు టోలెమీ రచనలలో ఈ ఓడరేవు ప్రస్తావన ఉంది. ఆ తరవాత కొన్ని శతాబ్దాల అనంతరం మరొక సుప్రసిద్ధ చీనా యాత్రికుడు హుయాన్‌సాంగ్ కూడా దీనిని సందర్శించాడు. ఆయన దీనిని చెల్లిటాటో రేవుగా పేర్కొన్నాడు. బహుశా అది 'చిలికా' అయి



ఉంటుంది. ఈ ఓడరేవు ప్రాచీన నామం బౌద్ధ సాహిత్యంలో కనిపించే 'దంతపుర' అయి ఉంటుందని కొందరు పండితులు అభిప్రాయపడుతున్నారు. ఈ సిద్ధాంతాలన్నిటికీ బలమైన ఆధారాలు ఉన్నాయి. ఈ సరస్సులో వందకు పైగా చిన్నా, పెద్దా ద్వీపాలు ఉన్నాయి. వీటిలో చాలా వరకు జన నివాసాలు కాని రాళ్ళ ప్రదేశాలు. వాటిలో ఒకదాని పేరు 'దీప పహాడ్'. అంటే 'దీపం కొండ' అని అర్థం. రాత్రుల్లో దానిమీద వేసే మంటలు రేవులోకి వచ్చే ఓడలకు సంకేతాలుగా పనిచేసేవి.

దీవులన్నిటిలోకీ చాలా పెద్దది 'పారికుడ్'. ఇటీవల కాలం వరకు అదొక ద్వీపరాజ్యంగా ఉండేది. ఒక చిన్న రాజు పరిపాలించేవాడు. అయితే, దీనికన్నా సుప్రసిద్ధమైనది - యాత్రాస్థలమైన కాళీజై ద్వీపం. సుందర పర్యాటక కేంద్రమైన బాలూగాన్‌కు 16 కి.మీ. దూరంలో వున్న ఈ ద్వీపంలోని ఏకైక ఆకర్షణ కాళీ జై మాత దేవాలయం. కాళీ అంటే అధిక సంఖ్యాకులు పూజించే జగన్మాత రూపాలలో ఒకటని అందరికీ తెలుసు. దీనికి 'జై' అనే

## సరస్సులోని ఆకర్షణలు

**పక్షుల దీవి :**

స్థానిక పక్షులకూ, వలస పక్షులకూ ఈ దీవి నిలయం. రకరకాల పక్షుల పట్ల ఆసక్తి ఉన్నవారికి ఇదొక స్వర్గంలా కనిపిస్తుంది.

**కాళీజై దీవి:**

ఈ ద్వీపంలో కాళీజై మాత ఆలయం ఉంది. ఏటా మకర సంక్రాంతి రోజున ఘనంగా ఉత్సవం జరుగుతుంది. ఇది సుప్రసిద్ధమైన వినోద కేంద్రం కూడా.

**సత్పారా:**

చిలికా సరస్సు సముద్రంలో సంగమిస్తున్న ప్రదేశంలో ఉన్న విశ్రాంతి గృహం ఇది. చిలికాను చూసి ఆనందించటానికి అనువైన ప్రదేశం. సంవత్సరం పొడవునా కనిపించే డాల్ఫిన్స్, శీతాకాలంలో వచ్చే వలస పక్షులు స్థానిక పక్షులు ప్రకృతి అందాలను చూసి ఆనందించాలనుకునే వారిని విశేషంగా ఆకర్షిస్తోంది. సత్పారాలో బోటింగ్ సదుపాయాలు కూడా లభ్యమవుతాయి.



మాట ఎలా జతకలిసింది? దీనిని వివరించే రెండు ఉదంతాలు ప్రచారంలో ఉన్నాయి : చిన్న సైన్యం గల పారికుడ్ అనే చిన్న రాజ్యానికి అధి దేవత కాళి. ఒకసారి అంతకన్నా బలమైన రాజు పారికుడ్ మీదికి దండెత్తి వచ్చి, దానిని తన రాజ్యంతో కలుపుకుంటానని హెచ్చరించాడు. పారికుడ్ రాజు తన రాజ్యాన్ని శత్రు రాజు సేనల ముట్టడి నుంచి రక్షించమని దేవతను ప్రార్థించాడు.



శత్రుసేనలు రాత్రి సమయంలో వచ్చి సరస్సు తీరంలో దిగాయి. తెల్లవారగానే ముట్టడించాలని సైన్యాధ్యక్షుడు నిర్ణయించడంతో సేనలు యుద్ధానికి సర్వసన్నద్ధమయ్యాయి. తీరా తెల్లవారాక చూస్తే, ఆ దీవి చుట్టూ వేన వేల సైనికుల ఆయుధపాణులై కనిపించారు. అంత చిన్నరాజ్యంలో ఇంత పెద్ద సైన్యమా అని శత్రు సైనికులు ఆశ్చర్యపోయారు. ఇంత పెద్ద సైన్యంతో యుద్ధానికి దిగి ఓటమితో అవమానం పాలవడంకన్నా, తిరుగుముఖం పట్టడమే గౌరవప్రదమని గుట్టుచప్పుడు కాకుండా తిరిగి వెళ్ళారు!

వచ్చిన శత్రుసేనలు ఎందుకు తిరిగి వెళ్ళాయా అని ఆశ్చర్యపోయిన పారికుడ్ రాజు అసలు సంగతిని ఆరాతీశాడు. ఆ దీవిలో చేరిన వేనవేల ఫ్లెమింగో పక్షులను మానవ సైనికులని భ్రమపడి శత్రు సేనలు వెనుదిరిగి వెళ్ళాయని తెలిసింది. బహుశా ఈ భ్రమను కాళీమాత కల్పించి ఉంటుంది. ఈ విజయం ఆ తల్లిదే గనక రాజు 'కాళీ జై' అంటూ ఆమెను స్తుతించాడు. ఆనాటి నుంచి ఆమెకు 'కాళీ జై' అనే సార్థక నామం ఏర్పడింది.

రెండవ కథ మరింత ప్రాచుర్యంలో ఉంది. కాళీ జై అన్నది ఒక అమ్మాయి పేరు. ముఖం మీద నల్లటి మచ్చ ఉండడం వల్ల ఆమెకు ఆ

పేరు వచ్చింది. చిలికా సరస్సు సమీప గ్రామంలో నివసించే ఆ అమ్మాయికి రెండే రెండు ఆశయాలు : ఒకటి ప్రజలందరి క్షేమాన్ని కోరుతూ జగన్నాతను పూజించడం; రెండు – పెద్దలకూ, రోగులకూ సేవలందించడం. ఆమె అంటే అందరికీ ఇష్టం. ఆమెకు యుక్త వయసు రాగానే, పెళ్ళి చేయాలని తగిన వరుడి కోసం పెద్దలు వెదకసాగారు. అఖరికి మరొక దీవికి చెందిన ఒక యువకుణ్ణి వరుడిగా నిర్ణయించి పెళ్ళికి తగిన ఏర్పాట్లు చేయసాగారు. సంప్రదాయానుసారం పెళ్ళికొడుకు ఇంట పెళ్ళి జరగాలి గనక, పెళ్ళి కూతురిని అక్కడికి తీసుకువెళ్ళాలి.

అయితే, కాళీ జై ఎదురుతిరిగి ఏడుస్తూ, "నాకా జీవితం వద్దు," అన్నది. అయినా ఆమె మాటను ఎవరూ పట్టించుకోలేదు. కొందరైతే ఆమెకు మతి చలించిందన్నారు.

పెళ్ళి రోజు రానే వచ్చింది. ఆమెను తండ్రితో బంధువర్గంతో పడవలో ఎక్కించారు. ఆమె పడవలో మౌనంగా చలనరహితంగా కూర్చున్నది. ఆమె తరచూ తలెత్తి, నిర్మల నీలాకాశాన్నీ, ఆ తరవాత తల దించి, ఆకాశాన్ని ప్రతిబింబిస్తున్న ప్రశాంత తటాకాన్నీ చూడసాగింది. ఆమె మౌనాన్ని చూసి పరిస్థితులతో రాజీ పడి పెళ్ళికి సిద్ధమవుతున్నట్టు పెద్దలు భావించి సంతోషించారు. అయితే, గమ్యం సమీపిస్తున్న కొద్దీ ఆమెలో అలజడి ఎక్కువైంది. ఆకాశంకేసి మళ్ళీ మళ్ళీ చూడసాగింది.

ఉన్నట్టుండి ప్రచండంగా గాలి వీచసాగింది. సమీపంలోని సముద్రం నుంచి ఎత్తయిన అలలు సరస్సులోకి భీకరంగా చొచ్చుకురాసాగాయి. అంతవరకు దూదిపింజంత మబ్బు లేని ఆకాశం క్షణాలలో దట్టమైన కారు మేఘాలతో, కుంభవృష్టి ఆరంభించింది. ఉరుములూ, మెరుపులూ భయానక వాతావరణాన్ని సృష్టించాయి.

ఉధృతమైన అలల మీద పడవ బెండులా తేలియాడసాగింది. "ఎక్కడున్నావు తల్లీ?" అని అరిచాడు కాళీ జెయ్ తండ్రి. ఆమె సమాధానం చెప్పేలోగా పడవ తల్లకిందులయింది.

క్షణాలలో వర్షం ఆగిపోయింది. మేఘాలు మటుమాయమయ్యాయి. గాలి వీచలేదు. ప్రయాణీకులు దీవి పక్కన రొమ్ముల లోతు నీళ్ళల్లో నిలబడి ఉన్నారు. ఒకరినొకరు చూసుకున్నారు. అందరూ ఉన్నారు - ఒక్క కాళీ జెయ్ తప్ప.

"అమ్మా తల్లీ! ఎక్కడున్నావు బిడ్డా?" అంటూ ఆమె తండ్రి హృదయ విదారకంగా విలపించాడు. ఆ సరికే తటాకం తీరంలో నిలబడ్డ కొందరు గ్రామస్థులు పెళ్ళికూతురును వెదకడానికి పూనుకున్నారు. అయినా, ఫలితం లేకపోయింది.

ఆ రోజు తుఫాను వీచడానికి ముందు, సరస్సులో ఉన్న జాలరులకు ఒక విచిత్ర అనుభూతి కలిగినట్టు చెప్పారు. ఆ బలమైన అలలకూ, గాలులకూ ఎదురొడ్డి తమ పడవలను, ఏదో అద్భుతశక్తి తీరానికి చేర్చినట్టు చెప్పారు. తమకు సాయంగా అస్పష్టమైన ఏదో స్త్రీ రూపం కనిపించినట్టు చెప్పారు. అది కాళీ జై అయి ఉంటుందని అందరూ నమ్మారు. ఆమె మరణానంతరం కూడా

## సందర్శించటానికి అనువైన సమయం

పక్షుల కిలకిలారావాలతో సరస్సు ప్రతిధ్వనించే శీతాకాలమే చిలికా సరస్సును సందర్శించటానికి అనువైన సమయం. బాలూగావ్, బార్కుల్, రాంభా మొదలైన స్థలాల నుంచి పడవలలో వెళ్ళి సరస్సును తిరిగి చూసి రావచ్చు. పడవలు అద్దెకు లభిస్తాయి. కావాలంటే స్థానిక జాలరులతో పాటు వారి కొయ్య పడవలలో వెళ్ళి తిరిగి చూసి రావచ్చు..

## వినోద యాత్రలు

### నిర్మలఝర్

రాంభా నుంచి 11 కి.మీ., బార్కుల్ నుంచి 21కి.మీ. దూరంలో వున్న నిర్మలఝర్ ముఖ్యమైన తీర్థయాత్రా కేంద్రం. ఇది ఒక వినోద యాత్రా స్థలం కూడా.

### నారాయణి :

బార్కుల్‌కు 10 కి.మీ. దూరంలో ఒక సెలయేటి ఒడ్డున నారాయణి దేవత ఆలయం ఉంది. ఆలయం, దాని చుట్టు పక్కల ప్రదేశం చాలా అందమైన విహార కేంద్రాలు.

### బాన్‌పూర్ :

ఇదొక ముఖ్యమైన తీర్థయాత్రా కేంద్రం. ఇక్కడ భగబతి, దక్ష ప్రజాపతి ఆలయాలు ఉన్నాయి. బార్కుల్ నుంచి 13 కి.మీ., బాలుగాన్ నుంచి 8 కి.మీ. దూరంలో ఇది ఉంది.

ఆమె ఇతరులకు సాయపడడం కొనసాగించింది. ఆమె తన రక్షణకు స్వయంగా మరణాన్ని రప్పించుకున్నట్టు చెబుతారు.

ఈ సంఘటన జరగడానికి పూర్వమే అక్కడ కాళీ మాత ఆలయం ఉండే అవకాశం ఉంది. క్రమేణా, ఆ యువతి కాళీజై ఆత్మ కూడా కాళీమాత అంశగా గుర్తించబడింది. ఏటా మాఘమాసం (జనవరి మధ్యలో) మకర సంక్రాంతి నాడు ఇక్కడ కాళీ జై ఆలయంలో ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి. కోళ్ళు, మేకలతో భక్తులు తమ ప్రార్థనలు చెల్లించడానికి వస్తారు. అయితే ఇక్కడ బలులివ్వడం లేదు. దేవతకు అర్పించిన తరవాత వాటిని దగ్గరున్న అడవులలోని మూడు కొండల మీద వదిలి పెడతారు. ఆలయం చుట్టూ ఇలాంటి జంతువులు తిరుగుతూ ఉండడం కనిపిస్తాయి.

కాళీ జై ఆత్మ ఆనాటి నుంచి కొలిచే ప్రజలను కొంగుబంగారమై కాపాడుతున్నది అన్నది భక్తుల విశ్వాసం. అయితే, అక్కడి ప్రజలు, వచ్చే భక్తులు



తటాకం నైర్మల్యాన్ని, పవిత్రతను కాపాడుకుంటున్నారా అన్నది ఈనాటి ప్రశ్న. ప్రణాళికాబద్ధంగా కొన్ని జాగ్రత్తలు, చర్యలు తీసుకుంటే చిలికా సరస్సును ప్రపంచంలోని సహజ సుందర ప్రదేశాలలో ఒకటిగా తీర్చిదిద్దవచ్చు. సరస్సు సముద్రంలో కలిసే చోటును 'సత్పార' అంటారు. సూర్యోదయ సమయంలో ఆ సుందర దృశ్యం కనుల విందు చేస్తుంది. నిరంతరం అలలతో ఘోషించే సముద్రం ఒకవైపు, ప్రశాంతమైన సరస్సు మరొకవైపు, ఆకాశంలో తేలే మేఘాలకూ, కాసే ఎండకూ అనుగుణంగా తమ రంగులను మార్చే కొండలు, పచ్చని ప్రదేశాలు ఎల్లప్పుడూ సందర్శకుల హృదయాలను ఆనందంతో పులకరింపజేస్తాయి. డాల్ఫిన్స్ కూడా ఇక్కడ విరివిగా తిరుగుతుంటాయి.

సరస్సు పరిసర ప్రాంతాలు సుసంపన్న చారిత్రక సంప్రదాయాలను కలిగినవి. సరస్సుకు సమీపంలోని బాన్పూర్ అతి ప్రాచీన కాంగాడ్ రాజ్యానికి రాజధానిగా ఉండేదని చెబుతారు. ఆ రాజులు ఇక్కడ చాలా

## అక్కడికి చేరుకోవడం ఎలా?

విమాన, రైలు, రోడ్డు మార్గాలలో చిలికా చక్కగా కలుపబడి ఉన్నది. అతి సమీపంలో ఉన్న విమానాశ్రయం భువనేశ్వర్. ఇది బార్కుల్ నుంచి 150 కి.మీ. రాంభా నుంచి 130 కి.మీ. సత్పారా నుంచి 110 కి.మీ. దూరంలో ఉన్నది. ఇండియన్ ఎయిర్‌లైన్స్ సంస్థ ఢిల్లీ, కొల్‌కతా, విశాఖపట్నం, రాయ్‌పూర్, హైదరాబాద్, ముంబై, చెన్నయ్‌ల నుంచి విమానాలు నడుపుతున్నది.

ఆగ్నేయ రైల్వే కొల్‌కతా రైలు మార్గం బాలుగాన్, చిలికా, ఖాలీకోట్, రాంభాల వద్ద చిలికాను తాకుతూ వెళుతుంది. బార్కుల్‌కు సమీపంలో అంటే 5 కి.మీ. దూరంలో బాలూగాన్, సత్పారాకు సమీపంలో అంటే 50 కి.మీ. దూరంలో పూరీ రైలు స్టేషన్లు ఉన్నాయి.

కొల్‌కతా నుంచి చెన్నయ్‌కి కటక్-భువనేశ్వర్, బాలూగాన్, బార్కుల్, రాంభా, బెర్హంపూర్, విశాఖపట్నాల గుండా వెళ్ళే 5వ నంబర్ హైవే చిలికా సరస్సును అనుకుని వెళుతుంది. ఓ.టి.డి.సి.తో పాటు కొన్ని ప్రైవేటు సంస్థలు పూరీ, భువనేశ్వర్‌ల నుంచి లగ్జరీ కోచెస్, కార్లూ నడుపుతున్నాయి.

దేవాలయాలను నిర్మించారు. వాటిలో కొన్ని ఇంకా పూజలందుకుంటూ నిత్య నూతనంగా వెలుగొందుతున్నాయి. ప్రకృతి కేవలం తన ఆనందం కోసమే సృష్టించుకున్నదా అన్నట్టు సరస్సు తీరం పొడవునా ఏకాంత సుందర ప్రాంతాలు మైళ్ళకు మైళ్ళు విస్తరించి ఉన్నాయి!

ఈ సరస్సును చూసి ప్రేరణ పొంది ఒరిస్సాకు చెందిన కవులెందరో అందమైన కవితలను వెలయించారు. అలాంటి వారిలో ఆధునిక ఒరియా కవులలో ముఖ్యుడైన రాధానాథ్ రాయ్ సుప్రసిద్ధుడు. ఈ సరస్సు అందచందాలను అభివర్ణిస్తూ ఆయన రచించిన సుదీర్ఘ కవితను అమర కావ్యంగా పేర్కొంటారు. అది వర్ణన, తాత్విక చింతనల సమ్మేళనం. సరస్సుకు సంబంధించిన బ్రహ్మాండమైన ప్రకృతి స్వభావాలు కవిలో అద్భుతమైన ఆలోచనా తరంగాలను పుట్టించాయి.

ఆధునిక ఒరిస్సా నిర్మాతగా మన్ననలందుకున్న గోపబంధుదాస్ కూడా చిలికా సరస్సును వర్ణిస్తూ హృద్యమైన కవితలను రచించాడు. చిలికా సరస్సు తీరం గుండా రైలులో ప్రయాణం చేస్తూ, అక్కడి ప్రకృతి సోయగాలకు ముగ్ధుడై ఆ కవితలను రాశాడు. ప్రకృతిలో దాగి వున్న అద్భుత విన్యాసాలను మనం గుర్తించేలా ఆయన చేస్తాడు. మూడవ కవి



గోదా బరిష్ మిశ్ర, కాళీజై ఉదంతానికి మృదుమధురమైన తన కవితలతో అమరత్వం ప్రసాదించాడు!

ఆ మహాసరస్సును సందర్శించడానికి వెళ్ళే మనుషులమైన మనం చేసే గాయాలను సైతం తట్టుకుని అది విభిన్నమైన జీవంతో కళకళలాడుతున్నది. అక్కడి అందాలను చూసి ఆనందించటంతో సరిపెట్టుకోకుండా ఆ ప్రదేశాన్ని గౌరవించి, సూక్ష్మమైన దాని ప్రభావంతో ప్రయోజనం పొందాలనుకునేవారు మాత్రమే దానిని గ్రహించగలరు. ఆ సరస్సుకు ఆకర్షించే ప్రకాశం ఉంది. ఒకానొకప్పుడు, శ్రీ జగన్నాథ మందిరాన్ని దోచుకోవటానికి దోపిడీ దొంగలు వస్తున్నారని తెలియడంతో పూజారులు ఆలయ విగ్రహాలను తెచ్చి, సరస్సు గుండా పారికుడ్ దీవిలో రహస్యంగా దాచారని చెబుతారు. దేవదేవుడైన జగన్నాథుడికే ఆశ్రయమిచ్చిన సరస్సు అలిసిన హృదయాలను సేదదీరుస్తుందనడంలో సందేహం లేదు. సరస్సు ప్రశాంత వైశాల్యం మన చైతన్య విస్తృతికి సాయపడుతుంది.



## ఎక్కడ బస చేయాలి?

సరస్సు లోపల, వెలుపల అనేక చోట్ల బస చేయడానికి వసతి సౌకర్యాలు ఉన్నాయి. ఒ.టి.డి.సి. కూడా హోటళ్ళను నడుపుతున్నది. కొన్ని హోటళ్ళను ప్రైవేటు సంస్థలు నిర్వహిస్తున్నాయి..



## పర్యాటక కార్యాలయాలు

రాంభా టూరిస్ట్ భవన్,
బార్కుల్.

పూరీ టూరిస్ట్ ఆఫీస్,
వి.ఐ.పి. ఛాక్.

# ప్రకృతి వివరణా కేంద్రం

చిలికా కోసం వచ్చే పర్యాటకులు తప్పకుండా సందర్శించవలసిన విజ్ఞాన కేంద్రం చిలికా సరస్సుకు సింహద్వారంలా ఉన్న సత్‌పరాలోని 'విజిట్ సెంటర్'. చిలికా సరస్సు పర్యావరణాన్ని తెలియజేసే మినీ మ్యూజియం ఇక్కడ ఉంది. చిలికాను సందర్శించే పర్యాటకులకు అక్కడి జీవ వైవిధ్యాన్ని - గ్యాలరీస్, అక్వారియా, ఆడియో-విజువల్ ఎయిడ్స్, డైయోరామాస్, టచ్ స్క్రీన్ ఇన్ఫర్మేషన్ ప్యానల్స్ ద్వారా వివరిస్తారు. పిల్లలకని ప్రత్యేకంగా 'డిస్కవరీ రూమ్' కూడా ఉంది. పర్యాటకులకు అక్కడి ప్రకృతి పర్యావరణం గురించిన ఒక అవగాహనను కల్పించి ఇక్కడి ప్రాణులకూ పర్యావరణానికీ హాని కలిగంచకుండా రక్షణ కల్పించడమే ఈ కేంద్రం ముఖ్య ఉద్దేశం.

పర్యాటకులకు మరింత సహాయంగా ఉండడానికి వీలుగా ఇక్కడ కంప్యూటర్ సాయంతో టచ్ స్క్రీన్, జంతు వృక్ష జాతుల వివరణలు, వలస పక్షుల, జంతువుల ఫొటోలు, డిజిటల్ శబ్ద యంత్రాలు, మొదలైన వాటి సాయంతో కావలసినంత సమాచారాన్ని అందజేస్తున్నారు. పిల్లలు పాలుపంచుకోవడం ద్వారా విషయాలు తెలియజేయడానికి వీలుగా పజిల్స్, బోర్డ్ గేమ్స్ మొదలైన వాటితో 'ఇంటర్ యాక్టివ్ చిల్డ్రన్స్ కార్నర్' ఏర్పాటు చేయబడివుంది.



# చీకటిలోంచి వెలుగుకు



అనుభా
మొహంతి,
కటక్



ఐశ్వర్య
గణేశన్,
భోపాల్

చిమ్మచీకటి కమ్ముకున్న రాత్రి. ఆకాశంలో చంద్రుడు లేడు. ఇంట్లో దీపంలేదు. అర్ధరాత్రి కావడంతో మంచి నిద్రలో ఉన్నాను. ఉన్నట్టుండి శబ్దం. గోడ గడియారం పన్నెండుసార్లు మోగింది. కళ్ళు తెరిచాను. దూరంగా రెండు ఆకారాలు. నా గదికేసి వస్తున్నాయి. భయపడిపోయాను. అర్ధ రాత్రి సమయాల్లో వచ్చే పిశాచాలు, దయ్యాలు, దొంగల కథలు జ్ఞాపకం రావడంతో హడలిపోయాను. అర్ధరాత్రి సమయంలోనే దయ్యాలు తచ్చాడుతాయి. దొంగలు వస్తారు. బహుశా ఆ ఆకారాలు ఏ దయ్యాలో అయి ఉంటాయి. కాకపోతే దొంగలు. ఈ రాత్రితో నా పని అయిపోయింది. భయంతో కళ్ళు తెరవలేకపోయాను. గట్టిగా మూసుకున్నాను. నిద్రపోవడానికి ప్రయత్నించాను. వీలు కాలేదు.

ఆ తరవాత ఏదో సంగీతం వినిపించింది. టేప్ రికార్డర్ నుంచి పాట వినిపిస్తోంది. అయినా, కరెంటు లేకుండా టేప్ రికార్డర్ ఎలా పాడు తుంది? ఆ తరవాత చిన్నచిన్న దీపాలు, ఆ ఆకారాల ముందు నా గదికేసి రావడం స్పష్టంగా కనిపించాయి. పవర్ కట్ సమయంలో రెండు ఆకారాలు, శబ్దం, వింత కాంతులు. నాలో భయం మరింత పెరిగింది. గుండె వేగంగా కొట్టుకోసాగింది.

భయంకరమైన ఆలోచనలతో లేచి కూర్చోబోయాను. ఆ క్షణంలోనే నా భయాలన్నీ తొలగిపోయాయి. టేప్‌రికార్డర్ బ్యాటరీ సాయంతో వీనుల విందుగా సంగీతం వినిపిస్తోంది. 'హ్యాపీ బర్త్ డే టూ యూ,'' అంటూ పుట్టిన రోజు శుభాకాంక్షలు. వెలుగు మరేదో కాదు, వరుసలుగా వెలిగించిన పదమూడు కొవ్వొత్తుల కాంతి. భయపెట్టిన ఆ రెండు ఆకారాలు దయ్యాలు కావు. మా అమ్మ, నాన్నలు! చేతిలో టేప్ రికార్డర్, పళ్ళెంలో కొవ్వొత్తులు వెలిగించు కుని కేక్‌తో నాకు పదమూడవ జన్మదిన శుభాకాంక్షలు చెప్పడానికి వస్తున్నారు. అర్ధరాత్రి చీకటిలో నాకు జన్మదిన ఉషోదయ శుభా కాంక్షలు! భయాందోళనల నుంచి ఆనంద సుమాలు!!



# ఘనమైన పుట్టినరోజు



ప్రియా పరాశర్,
జబల్‌పూర్

రాత్రి తొమ్మిదయింది. రుచి, దీపక్ తల్లిదండ్రులు బయటకు వెళ్ళారు. పిల్లలు ఇంటి వద్ద వాళ్ళ బామ్మతో ఉన్నారు. అది నవంబరు నెల. రేపు ఇరవైయవ తేదీ బామ్మకు పుట్టినరోజు. ఆమెకు ఎనభై తొమ్మిదేళ్ళు పూర్తి కాను న్నాయి. పిల్లలు ఆమెను కథ చెప్పమని పట్టుబట్టారు. మొదట ఆమె కాదన్నా, ఆ తరవాత చెప్పక తప్పలేదు.

''పిల్లలూ, నా చిన్నప్పుడు నేనూ మా బామ్మ దగ్గర చాలా కథలు విన్నాను. బామ్మ ఒకసారి ఒక కథ చెప్పంది. ఆ కథలోని స్త్రీలో ప్రేమ పెద్ద మార్పు తీసుకువచ్చింది. ఆ కథ ఇప్పుడు మీకు చెబుతాను వినండి,'' అంటూ మెల్లగా చెప్పసాగింది: ''ఒకప్పుడు మేరీ కార్మెల్ అనే ఆవిడ భర్తతో నివ సిస్తూ ఉండేది. ఆమె భర్త సైన్యంలో కల్నల్‌గా ఉండే వాడు. దురదృష్టవశాత్తు ఆయన యుద్ధంలో మరణించాడు. వారికి పిల్లలు లేరు. అందు వల్ల ఆమె ఇంట్లో ఒంటరిగా ఉంటూండేది. ఆమె పట్ల ఇరుగుపొరుగు అందరూ ఎంతో ప్రేమ కనబరచినప్పటికీ ఆమె మాత్రం ఎవరినీ పట్టించుకునేది కాదు. చాలా ముభావంగా ఉండేది.''



బామ్మ కాస్సేపు ఆగి గొంతును సవ రించుకుని మళ్ళీ చెప్పడం కొనసాగించింది : ''ఆమె ఎవరి మంచి చెడ్డలనూ పట్టించుకునేది కాదు. 'మా పాప పుట్టిన రోజు, రండి,' అని ఎవరైనా పిలిస్తే, ఏవో సాకులు చెప్పి వెళ్ళేది కాదు. తలుపులు మూసుకుని ఇంట్లోనే కూర్చునేది.

ఒక రోజు ఆమె బయటకు వెళ్ళాలని నిర్ణ యించింది. ఎప్పుడో తెలుసా? ఆమె పుట్టిన రోజున. ఆమె ఇల్లు వదిలి రోడ్డుమీద నడు స్తూంటే అందరూ ఆప్యాయంగా పలకరించారే తప్ప, ఒక్కరూ పుట్టినరోజు శుభాకాంక్షలు చెప్పలేదు. ఎందుకంటే ఆమెకు ఆ రోజు పుట్టిన రోజని ఎవరికీ తెలియదు. అది ఆమెకు చాలా విచారం కలిగించింది. తను ఇతరులను ఉదాసీన పరచినప్పుడు వాళ్ళెంతగా బాధపడి వుంటారో ఆమెకిప్పుడు అర్థమయింది. ఆమె చర్చికీ, పార్కుకూ వెళ్ళింది. వెళ్ళిన చోటల్లా అందరూ ఆమెను ఆప్యాయంగా పలకరిం చారు. ఆమె కొంచెంసేపు రోడ్డు వారగా వున్న



కె.వి. నందన్,
చెన్నయ్

బెంచీమీద కూర్చుని, 'భగవంతుడా, నేనెలాంటి మూర్ఖురాలిని! ఇన్నాళ్ళూ ఇతరులు చూపే ప్రేమను గ్రహించలేక పోయాను. ఉదాసీనంగా ఉన్నాను. ఈ రోజు నా పుట్టిన రోజు. ఏ ఒక్కరూ నాకు శుభాకాంక్షలు చెప్పడంలేదు,' అని భోరున విలపిస్తూ అక్కడే కూర్చున్నది.''

బామ్మ కథచెప్పడం ఆపి, గుక్కెడు నీళ్ళు తాగి, గొంతు తడుపుకుని మళ్ళీ చెప్పసాగింది: ''ఆమె చేతి గడియారం చూసింది. ఎనిమిదయింది. ఆమె లేచి ఇంటికేసి బయలుదేరింది. చేతిలో కానుకలతో చాలా మంది నిలబడి వుండడం చూసి ఆమె విస్మయం చెందింది. అందరూ ఆమెను మరిన్ని కానుకలూ, కేక్ అమర్చిన టేబుల్ దగ్గరికి తీసుకువెళ్ళారు. వాటిని చూడగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తనను క్షమించమని అందరినీ వేడుకున్నది. ఆమె పుట్టిన రోజు కేక్ కట్ చేస్తూ ఉంటే అందరూ పుట్టినరోజు గీతం ఆలపించారు. ఆ రోజు నుంచి ఆమె చుట్టుపక్కల జరిగే ప్రతి ఇంటి మంచి చెడ్డలలో కలుసుకునేది. పిల్లలూ, కథ ఎలా ఉంది?'' అని అడిగింది బామ్మ.

''చాలా బావుంది, బామ్మా,'' అన్నారు పిల్లలు ఆనందంగా.

అంతలో వాళ్ళ తల్లిదండ్రులు రావడంతో పిల్లలు బామ్మ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళి పడుకున్నారు.

మరునాడు రాత్రి తొమ్మిది గంటల వరకు అన్నీ యథాప్రకారం జరిగిపోయాయి. సరిగ్గా తొమ్మిది గంటలకు పిల్లలు డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చి కొన్ని ఏర్పాట్లు చేసి లైట్లు ఆర్పారు. బామ్మ టీ.వీ. చూడడానికి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చింది. ఆమె లైటు వేయగానే అందరూ కప్‌బోర్డ్ వెనక నుంచీ, టీ.వీ. వెనకనుంచీ, తలుపు చాటు నుంచీ బిలబిలమంటూ అక్కడికి చేరుకున్నారు. కేక్‌ను తెచ్చి ఆమె ముందుంచి పుట్టినరోజు పాట పాడారు. ఆ తరవాత ఆమెకు పిండివంటలతో మంచి భోజనం పెట్టారు. ఆ తరవాత ఆమెకు పిల్లలు మంచి శాలువాను బహూకరించారు. మా ప్రియమైన 89 సంవత్సరాల స్నేహితురాలికీ, కథలు చెప్పే బామ్మకూ - ప్రేమతో రుచి, దీపక్ - అని అక్షరాలు గల చిన్న గిఫ్ట్ ప్యాకెట్‌ను అందించారు. బామ్మ దానిని తెరిచి చూసింది. అందులో ఒక బొమ్మ ఉంది. బామ్మ కళ్ళల్లో ఆనందబాష్పాలు!





# స్వేచ్ఛ విలువ



పి. కార్తిక్
రామస్వామి,
చెన్నయ్



"దయచేసి, చిలుకలు కొనివ్వండి నాన్నా," చాలా అందంగా ఉన్నాయి. కొనివ్వండి నాన్నా," ఇది మొదటిసారి కాదు, నాన్నను చాలాసార్లు అడిగేశాను. అయినా ఆయన కదలడంలేదు. నిజానికి గత రెండు నెలలుగా నాన్నను చిలుకల్ని కొనివ్వమని పోరుతున్నాను.

వీధి చివర ఒక వ్యాపారి రకరకాల పక్షులను పెంపుడు పక్షులుగా అమ్మడం చూసినప్పటి నుంచి నా మనసంతా ఆ చిలుకల మీదే ఉంది. ఆ అందమైన చిలుకలను ఒక పంజరంలో పెట్టాలి. రోజూ తెల్లవారక ముందే లేచి వాటికి 'గుడ్‌మార్నింగ్' చెప్పాలి. వాటికి వేళ తప్పకుండా పళ్ళూ, గింజలూ అందివ్వాలి. పంజరాన్ని చాలా శుభ్రంగా వుంచుకోవాలి. వాటికి చిన్న చిన్న మాటలు నేర్పాలి - ఇలా కలలు కనని క్షణం అంటూ లేకపోయింది.

అయితే, మా అమ్మానాన్నలు నాకు చిలుకలు కొనివ్వడానికి సుముఖంగా లేరు. వాటిని కొనిపెడితే నా చదువు దెబ్బతింటుందని అనుమానించారు. పక్షులు లేనిపోని ఇబ్బందులు కలిగిస్తాయన్నారు. అయినా నేను వదలలేదు. బుద్ధిగా చదువుకుంటానని మరీ మరీ చెప్పాను. ఆఖరికి నాన్న సరే అన్నాడు. మరునాడే నన్ను వ్యాపారి దగ్గరికి వెంటబెట్టుకు వెళ్ళారు. జాగ్రత్తగా పరిశీలించి చూసి, నాన్నతో చర్చించిన తరవాత ఒక జత చిలుకలను ఎంపిక చేశాను. పచ్చటి శరీరం, పగడంలాంటి ముక్కు, నాట్యం చేసే కళ్ళు, మధురమైన కంఠ స్వరం, చిలుకలు చాలా అందంగా ఉన్నాయి.

పంజరంతో సహా చిలుకలను తీసుకుని ఇంటికేసి నడిచాను. ఇరుగు పొరుగు మిత్రులు చూస్తూంటే నా కళ్ళు గర్వంతో మెరిశాయి. ఇంత అందమైన చిలుకలు నాకే సొంతంగా మరి!

మా అమ్మతో చాలా చర్చించిన తరవాత, పంజరాన్ని వెనకవైపు మేడ మీద వేలాడగట్టాను. అక్కడ కుండీలలో రకరకాల మొక్కలున్నాయి. అవి చిలుకలకు సహజ వాతావరణం కల్పిస్తాయని భావించాము. "అమ్మా! నాకు చేపల తొట్టి కొనాలనే ఆశ కూడా ఉందమ్మా. రకరకాల రంగుల చేపలను అందులో పెంచితే ఎంతో అందంగా ఉంటుంది. ఎప్పుడు కొనిస్తారు?" అని అడిగాను అమ్మను నవ్వుతూ. ఆమె సమాధానం చెప్పకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

మరునాడు తెల్లవారక ముందే అందరికన్నా ముందు నేనే లేచాను. అంత త్వరగా నేను నిద్ర లేవడం ముందెన్నడూ చూడలేదని అమ్మ అన్నది. తిన్నగా చిలుకల దగ్గరికి వెళ్ళాను. వాటికి 'టీను, మీను' అని పేర్లు పెట్టాను. 'గుడ్‌మార్నింగ్' చెప్పాను. గిన్నెలో పళ్ళు, ధాన్యాలు వేసి తినిపించాను. ఆ తరవాత స్కూలుకు సిద్ధమై వెళ్ళాను.





సయన్‌చంద,
కోల్‌కత

సాయంకాలం రాగానే టీనూ, మీనూతో కొంత సేపు ఆడుకున్నాను. ఆ తరవాత చదువు, హోమ్ వర్క్‌పూర్తిచేశాను. ఆ రాత్రి నాకెంతోఉద్వేగభరితంగా, ఆనందంగా గడిచింది.

మూడు రోజులు గడిచాయి. కొత్తపరిసరాలకు పక్షులు అలవాటు పడుతున్నాయి. అవి నేను పిలిస్తే చూస్తున్నాయి. అయినా అవి చూపులతో ఏదో ప్రాథేయపడుతున్నట్టు నాకు అనిపించసాగింది. అది నా ఊహేనేమో అనే అనుమానం కూడా నాలో కలిగింది.

నాలుగో రోజు రాత్రి ఒక వింత అనుభూతి కలిగింది. ఆ రాత్రి ముఖ్యమైన హోమ్‌వర్క్ చేయవలసి వచ్చింది. బాగా రాత్రయ్యింది. అయినా నిద్రపోకుండా అనుకున్న పనిని పూర్తి చేశాను. ఉన్నట్టుండి టీనూ, మీనూ పంజరాన్ని తడుతున్న శబ్దం వినిపించింది. ''దయచేసి మాకు స్వేచ్ఛ ఇవ్వు! దయచేసి మాకు స్వేచ్ఛ ఇవ్వు!'' అంటూ అవి వేడుకుంటున్నాయి. వాటి కళ్ళ నుంచి నీళ్ళు కారుతున్నాయి. ఆపై భరించలేకపోయాను. ''నన్ను క్షమించండి టీనూ, మీనూ. నన్ను క్షమించండి,'' అని ఏడుస్తూ అన్నాను.

''ఏమయింది?'' అంటూ మా అమ్మ నన్ను తట్టి లేపింది. ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను. అంతా కల. అయినా కావలసిన గుణపాఠం నేర్చుకున్నాను. మరునాడే టీనూ, మీనూలను తీసుకుపోయి సమీపంలో ఉన్న పార్కులో వదిలిపెట్టాను. అప్పుడు వాటి కళ్ళల్లో మెరిసిన కృతజ్ఞతా భావం ఇంకా నాకు జ్ఞాపకం ఉంది!

''అద్దాలచేపలతొట్టి కావాలా నాన్నా?'' అని మా అమ్మ చిన్నగా నవ్వుతూ అడిగింది.

''వద్దమ్మా, వద్దు. ఇకపై నా జీవితంలో పెంపుడు జంతువులకు స్థానం లేదు. చేపలు నదుల్లో, చెరువుల్లో అవి ఉన్నచోట అవి హాయిగా ఈదనీ. గాజు పెట్టెల్లో కాదు. ఇక మీదట పాకెట్ మనీ ఉంటే ఏం చేస్తానో తెలుసా? పంజరాలలోని పక్షులనూ, బంధించిన జంతువులనూ కొని వాటిని స్వేచ్ఛగా వదిలిపెడతాను,'' అన్నాను.

మా అమ్మ కళ్ళు గర్వంతో మెరిశాయి.





# సజీవ వస్తువులు



ప్రథా ఉమేష్
మెహతా, గోవా

చెట్టు చేమలు, మొక్కలు చైతన్య రహితాలని ఒకప్పుడు భావించేవారు. ఉత్తరోత్తరా శాస్త్రవేత్తలు చెట్టు చేమలకు ప్రాణం ఉందని నిరూపించారు. ఈ విషయాన్ని ఇప్పుడు ఎవరూ కాదనేవారు లేరు. ఈ సంగతి గురించి దాదాజీ, జినాల్‌కు చెప్పినప్పుడు - అంటే ఇప్పుడు మనం నిర్జీవ వస్తువుల నుకునేవి మునుముందు సజీవాలని నిరూపించబడవచ్చు కదా! అజ్ఞానం కొద్దీ ఇప్పుడు మనం వాటిని జీవం లేనివని భావిస్తున్నాము, అన్న ఆలోచన కలిగింది జినాల్ మనసులో.

అప్పటి నుంచి జినాల్‌కు చుట్టుపక్కల వున్న వస్తువుల పట్ల ఆసక్తి పెరిగింది. కొన్ని వస్తువులను సజీవాలుగా భావించసాగింది. మొదట గుండ్రాయితో మాట్లాడి చూసింది. కరుడుకట్టిన మౌనం తప్ప స్పందన లేదు. కొయ్య బొమ్మల ఉద్వేగాలను తెలుసుకోవటానికి జినాల్ ప్రయత్నించింది. ఎంత గీపెట్టినా, తిట్టినా కొట్టినా ఉలుకూ పలుకూ లేదు.

ఆఖరికి జినాల్ తన పొరబాటును గ్రహించి, ఏడవడం ప్రారంభించింది. ఆమె





నేహా అడిగా,
బెంగుళూరు

గులాబీ చెక్కిళ్ళపై కన్నీటి బొట్లు జలజలా రాలాయి. ఉన్నట్టుండి ఒక గంభీర కంఠస్వరం వినిపించింది. ''ఏడవకు, బిడ్డా!''

జినాల్ నాలుగు వైపులా తల తిప్పి చూసింది. కొయ్యబీరువా, ట్యూబ్‌లైట్, ఫ్యాన్, గోడ గడియారం, పెట్టెలు, బట్టలు మొదలైన చిన్నా, పెద్దా వస్తువులు తప్ప మనుషులెవరూ లేరు. కంఠస్వరం ఎక్కడి నుంచి వచ్చిందా అని జినాల్ ఆశ్చర్యపోయింది.

ఎంత ఆలోచించినా అంతుబట్టక పోయేసరికి, ఆమె కిటికీగుండా వెలుపలికి చూసింది. ఎవరూ లేరు. తనతో ఎవరైనా మాట్లాడుతున్నారా అని ఒక్క క్షణం ఆమెకు అనిపించింది. అందువల్ల ఆమె మరొకసారి గదులన్నిటినీ తిరిగి పరిశీలనగా చూసింది. ఒక గదిలో దాదాజీ ఒక్కడే గురకపెడుతూ నిద్రపోతున్నాడు. ఆ కంఠస్వరం కేవలం తన ఊహేనేమో అనే అనుమానం కూడా కలిగింది ఆమెకు. ఆ కంఠస్వరం ఏ దయ్యానిదో కాదు కదా? అనే ఆలోచన కూడా వచ్చింది. దయ్యాలంటే ఆమెకు నమ్మకం లేదుగానీ లోలోపల ఏదో చెప్పలేని భయం. మళ్ళీ ఆమె ఏడ్వడంతో కళ్ళ నుంచి నీళ్ళు కారసాగాయి.

''ఏడవకు బిడ్డా!'' అని మళ్ళీ అదే కంఠ స్వరం.

జినాల్ చుట్టుపక్కల కలియజూసి, ''ఎవరు నువ్వు ఎక్కడ నుంచి మాట్లాడుతు న్నావు?'' అని అడిగింది.

''నేనిక్కడే, నీ ఎదుటే ఉన్నాను, చిన్నారీ,''

''ఎవరు నువ్వు?''

''గాలిని!''

జినాల్ మనసు ఆనందంతో ఉప్పొంగిపోయింది. గాలిని కౌగిలించుకోవటానికి ప్రయత్నిం చింది. ''వాయుదేవా! నీ కంఠస్వరం చాలా మధురంగా ఉంది. నిజంగా నువ్వు మాట్లాడగలవా?'' అని అడిగింది.

''మాట్లాడగలను, చిన్నారీ!''



''మరి మనుషులు నిన్నెందుకు చైతన్య రహితమైనదిగా, భావోద్వేగాలు లేనిదానిగా, మాటలు రానిదానిగా భావిస్తారు?''

''నేను మాట్లాడితే, వినే ఓపిక, తీరిక వాళ్ళకు లేదు గనక!''

''అలాగా! మరి నేను నిన్నెలా వినగలుగు తున్నాను?''

''ఎదుటివారిని గుర్తించి, గౌరవించే ప్రేమపూరిత సున్నిత మనస్తత్వం నీకున్నది గనక. ఇక సెలవు తీసుకుంటాను. నేను



కదులుతూఉండాలి!''

''అవునవును.అయినా, అప్పుడప్పుడు వచ్చి నాతో మాట్లాడుతూ ఉండు,'' అన్నది జినాల్.

జినాల్ పట్టరాని ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది. ఇది కలా? నిజమా? అన్న అనుమానం కలిగింది. దానిని రూఢి చేసుకోవడానికి ''నాతో మాట్లాడడానికి ఈ గదిలో ఎవరైనా సిద్ధంగా ఉన్నారా?'' అని అడిగింది.

''నేను రెడీ!'' అన్నది పడకమీది చిన్న రబ్బరు బొమ్మ.

''నువ్వు మాట్లాడతావా? చాలా బావుంది. ఆ సంగతి ఇంతవరకు నాకు తెలియదే. నాకు కోపం వచ్చినప్పుడల్లా నిన్ను విసిరికొట్టానే, నీకు గాయం తగలలేదా?'' అని అడిగింది జినాల్.

''అవునూ, చాలా బాధ కలిగింది!'' అన్నది బొమ్మ.

''అలాగా! క్షమించు. ఇకపై ఎప్పుడూ విసిరికొట్టను, సరేనా?'' అంది జినాల్.

బొమ్మకు ఆయింట్‌మెంట్ రాసింది. ఇద్దరూ కలిసి ఆడుకున్నారు, పాడుకున్నారు. ఏవేవో హాయిగా కబుర్లు చెప్పుకున్నారు.

అంతలో కాలింగ్‌బెల్ మోగడంతో జినాల్ వెళ్ళి తలుపు తెరిచింది. ఆమె తల్లిదండ్రులు వచ్చారు. జినాల్ తన గదికి తిరిగి వెళ్ళి చూస్తే బొమ్మ నిర్జీవంగా పడివుంది''.

''అవును, మనుషులమైన మేము చుట్టూ ఉన్న సజీవ ప్రాణులను, నిర్జీవ జడ పదార్థాలుగా మార్చే కఠిన మనస్కులము, కఠిన హృదయులము,'' అన్నది జినాల్.







# దుర్వాసుడిగారి నవ్వు

సీతాపురం గ్రామంలో నివసించే దుర్వాసుడుగారు మంచి స్థితిమంతుడికిందేలెక్క. తాతల కాలం నుంచీ వస్తున్న లంకంత ఇల్లు, పాతిక ఎకరాలపైన మాగాణీ, యాభై ఎకరాలమెట్ట, పెద్దమామిడితోట-ఆయనను గ్రామంలో అందరూ గౌరవించేటట్టుచేస్తున్నాయి. నిజానికి ఆయన అసలుపేరు రామచంద్రయ్య. కానీ, ముక్కుమీదనే వుండే ఆయన కోపం, ఎవరి మీద అయినా కోపంవస్తే, ఎంతమాటైనా అనేసే అవలక్షణం వల్ల, అందరూ ఆయన్ని దుర్వాసుడుగారు అనే అనేవారు. ఆయన తనముక్కోపితనాన్ని, దుర్వాసుడు అన్న మాటను బిరుదులాగా భావించేవాడు.

దుర్వాసుడుగారికి ముగ్గురు పిల్లలు. పై ఇద్దరూ ఆడపిల్లలు. మగ పిల్లవాడు కిరీటి చివరివాడు. ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి అత్తవారిళ్ళకు పంపించాడు. ఆ వియ్యాలవారికి ఈయన నోటిపదును బాగాతెలుసు. ఇకఇల్లాలి సంగతి సరేసరి. భర్తతో ఉదయం నుంచీ సాయంత్రం వరకూ తిట్లూ,చీవాట్లూ వినీవినీ ఆవిడకు అదిఅలవాటైపోయింది.

ఇక కిరీటికి మాత్రం తండ్రి వైఖరి బొత్తిగా నచ్చేదికాదు. అతడికి పెళ్ళిసంబంధాలు రాసాగాయి. ఐతే, కిరీటికి కాస్త భయంగా వుండేది. వచ్చే కోడలు ఈ కోపిష్టి మామగారితో ఎలా వేగుతుందో, ఏ కలతలు రానున్నాయో అని ఆలోచిస్తూండేవాడు. చివరకు తండ్రి కోరిక ప్రకారం, ఆయన చెప్పిన అమ్మాయిని పెళ్ళాడేందుకు ఒప్పుకున్నాడు.

పెళ్ళికూతురు అరవింద సీతాపురానికి చాలా దూరంలోవున్న ఒంటి మామిడిపల్లి గ్రామసంపన్నరైతు కుమార్తె. ఒక్కగానొక్క కూతురుకావటాన, ఆమెకు పెద్దగా ఇంటి పనులు కూడా రావు. ఎంతో అల్లారు ముద్దుగా పెరిగింది.

పెళ్ళయిన రెండోరోజే ఎందుకయినా మంచిదని, తన తండ్రి విపరీతమైన కోపం గురించిచెప్పి, కాస్త సహనంగా వుండమని భార్యను హెచ్చరించాడు, కిరీటి. కోడలు

నందిరాజు పద్మలతా జయరాం



కాపరానికి వచ్చిన రెండుమూడు రోజులు కాస్త కోపం తగ్గించుకున్నా, తర్వాత ఎప్ప టిలా పెళ్ళాంపైన, కొడుకుపైన, పనివాళ్ళ పైన రంకెలు వెయ్యడం మొదలు పెట్టాడు దుర్వాసుడుగారు.

ఒకనాడు పితికిన పాలబిందెను అత్త గారు అందిస్తే, పెరట్లో నుంచి లోపలికి తెస్తున్న అరవిందను చూసి, "ఏం, మీ అత్తగారికేం రోగం? ఆ మాత్రం బిందె మోస్తే నడుం విరుగుతుందా ఏం?" అన్నాడు కోపంగా దుర్వాసుడుగారు.

ఐతే, నిజానికి కొత్తకోడలికి అప్పుడే పని చెప్పడం ఏమిటని, ఆయన బాధ. కానీ, ఆయన అరుపుకు జడుసుకున్నఅరవింద చేతుల్లో వున్న పాలబిందెను గడపమీదే జారవిడిచింది. బిందెడు గుమ్మపాలు నేల పాలయ్యాయి. అయ్యో, నా మూలంగా పాలుకాస్తా నేలపాలయాయే అని బాధప డుతూ కళ్ళనీళ్ళుపెట్టుకుని లోపలికి పరి గెత్తింది అరవింద. ఈ హఠాత్ సంఘట నకు ఒక నిమిషంపాటు నివ్వెరపోయాడు, దుర్వాసుడుగారు.

ఆ మర్నాడు మధ్యాహ్నంపూట, వసారాలో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్న దుర్వాసుడుగారు, ఎందుకో లోపలికివ చ్చేసరికి, పింగాణీపాత్రల్ని గుడ్డతో తుడు స్తూకనిపించింది, అరవింద. అదిచూస్తూ నే ఆయన, "ఇంటిపని వెధవలందరూ ఎక్కడ తగలపడ్డారు! పీకలదాకా మెక్కుతా రుగానీ, పని చెయ్యడానికి మాత్రం ఒక్కడూ కనిపించడు, తాటవలుస్తాను వెధవల్ని. ఎవడ్రా అక్కడా?" అంటూ అరిచాడు.

కొత్తకోడలు అరవింద విసుగెత్తించే పని చేస్తున్నదని ఆయన బాధ. ఆయన అరుపుకు గుండెఝల్లుమన్న అరవింద పింగాణీపాత్రల దొంతర్ని అలాగే వదిలేసింది. అవి పెద్దగా శబ్దం చేస్తూ నేలమీద పడిదొర్లాయి. ఆ విధంగా, దేశవిదేశాల నుంచి తెప్పించిన అపు రూపమైన పాత్రలుకాస్తా క్షణాల్లో ముక్కలు చెక్కలయ్యాయి. మొట్టమొదటిసారిగా తన కోపం మీద, తనకే కోపం వచ్చింది, దుర్వా సుడుగారికి.

మరొకరోజున భర్తకూ, మామగారికీ అన్నం వడ్డిస్తున్నది, అరవింద. ఆమె పప్పు పులుసు వడ్డిస్తూంటే, కొద్దిగా రుచిచూసిన దుర్వాసుడుగారు, "ఇంట్లో ఉప్పుకు కూడా కరువొచ్చిందా ఏం! పుట్టింట ఏం నేర్చినట్టు. వండడం రాదు సరే, వడ్డించడం కూడా రాదా?" అనేసరికి, అరవింద భయంకొద్దీ వెనుదిరగబోయి, పులుసుగిన్నెను ఉప్పు

చట్టిలో పడవేసింది. తర్వాత ఆమె అన్నం తిన కుండా గదిలో ముసుగుతన్ని పడుకుంది. తను ఉప్పు సరి పోలేదని మామూలు మాట మాత్రంగా చెబితే సరిపోయేదేమోఅనిపించి ంది, దుర్వాసుడు గారికి. తను అదుపుచేసు కోలేని కోపంతో కోడలిని బాధ పెట్టానే అనిపి ంచిందాయనకు.

ఆ క్షణంనుంచీ మామగారి గొంతువింటే చాలు, అరవింద వజవజ వణికిపోయేది. గిన్నెలు, చెంబులు చేతిలో ఏవి వుంటే వాటిని కిందికిజారవిడిచేది. చూసిచూసి, ఇదేమైనా జబ్బేమో అనిపించిన దుర్వాసుడుగారు, వైద్యుణ్ణికూడా పిలిపించాడు. ఆయన అర విందతో కొద్దిసేపు మాట్లాడి, దుర్వాసుడుగా రిని పక్కకుపిలిచి, ''అబ్బే, పిల్లది ఉత్తబెదురు తత్వం. మీరేకాస్త నెమ్మదిగా మాట్లాడుతూం డండి, అదే తగ్గుతుంది,'' అని చెప్పాడు.

దుర్వాసుడుగారికి, వైద్యుడు చెప్పిన దాంట్లో ఏదో తిరుగులేని వాస్తవం వున్నట్లని పించింది. తనే ఏరికోరి తెచ్చుకున్న కోడలి స్థితి గురించి ఆలోచించినకొద్దీ, ఆయనలో క్రమంగా మార్పురాసాగింది.

ఇలా వుండగా, సంక్రాంతి పండుగవచ్చింది. కూతుళ్ళ కుటుంబాలు రావడంతో, ఇల్లం తా సందడిగా వుంది. భోగిపండగ నాడు అం దరూ భోజనాలు చేశాక, పొలంవైపుకు వెళ్ళి తిరిగి వచ్చిన దుర్వాసుడుగారికి, నట్టింట్లో కూతుళ్ళూ, మనవళ్ళూ, మనవరాళ్ళూ, అల్లుళ్ళూ,కోడలూ, భార్యా- అందరూ గల గలా కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూవుడ డం కనిపించింది.

ఐతే, ఆయన ఇంట్లోకి అడుగు పెట్టగానే, ఎవరికివారు మాటాపలుకూ లేకుండా వుండి పోయారు. తర్వాత లేచి ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళబోతూండగా, దుర్వాసుడు గారు నవ్వుతూ, ''ఎందుకలా పరిగెత్తబోతు న్నారు, నేనేం పులినా ఏం అంత భయపడడా నికి! ఈ రోజునుంచీ నేనూ, మీతో హాయిగా నవ్వుతూ మాట్లాడతాను. నాకు కోపంవస్తే మీరు భయపడి పారిపోకండి, ఎదురు తిర గండి, సరేనా? అందరూ కూర్చోండి. హాయిగా కబుర్లు చెప్పుకుందాం,'' అన్నాడు.

ఆ మాటలతో అక్కడున్నవారందరికీ కలిగిన ఆనందం అంతాఇంతా కాదు. అందరూ కూడబలుక్కున్నట్టు ఒక్కసారిగా ఫక్కు మంటూ నవ్వారు.



## కాశ్మీరు జానపద కథ

భారతదేశానికి ఉత్తరాగ్రంలో ఉన్న ప్రాంతం జమ్మూ-కాశ్మీరు. 18,000 అడుగుల ఎత్తయిన హిమాలయ పర్వతాల మధ్య కాశ్మీరు లోయ ఉన్నది. ఇక్కడ ప్రవహించే జీలం నది ప్రధాన రవాణా మార్గంగానూ, జీవన వనరులను సమకూర్చేదిగానూ ఉన్నది.

ఎటు తిరిగినా సుందర ప్రదేశాలతో, రకరకాల పుష్ప ఫల వృక్షాలతో, జీవరాశులతో ఈ రాష్ట్రం 'భూతల స్వర్గాన్ని' తలపిస్తుంది.

కాశ్మీరు లోయలో వున్న అత్యద్భుత వృక్షం చినార్. ఇది లోయ అన్ని ప్రాంతాలలోనూ ఉన్నది. చాలా ఎత్తుకు ఎదిగే ఈ వృక్షం ఆకులు ఋతువుకు తగిన విధంగా రంగులు మార్చుకోవడం ఓ అద్భుత విశేషం!

కొండగొర్రె, మంచు చిరుత, కస్తూరి జింక, తోడేలు, ఎర్ర ఎలుగుబంటి, నల్ల ఎలుగుబంటి, యాక్, అడవి గాడిదలు, మొదలైన జంతువులు ఇక్కడి అడవులలో ఉన్నాయి.

సింధు, చీనాబ్, జీలం, రావి నదులు ఈ రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి. ఇవే కాకుండా అసంఖ్యాకమైన చిన్న నదులు, సరస్సులు, తటాకాలు ఇక్కడ ఉన్నాయి.

జమ్మూ అక్కడి దేవాలయాలకు చాలా ప్రసిద్ధి గాంచింది. బాహుమాతా, రఘునాథ్ మందిర్ ప్రాంగణం జమ్మూలో ప్రసిద్ధి గాంచిన దేవాలయాలు.

# విలువైన కానుక !

ఎత్తయిన హిమాలయ పర్వతాల మధ్య ఒక చిన్న గ్రామం ఉండేది. ఆ గ్రామం మూడు వైపులా కొండలూ, నాలుగో వైపున పెద్ద సరస్సూ ఉండేవి. ఆ గ్రామం చేరుకోవాలంటే సరస్సు దాటి వెళ్ళడం ఒక్కటేమార్గం. అయితే, విపరీతమైన చలికారణంగా ఆ సరస్సులో జలం తరచూ గడ్డ కట్టుకుపోయేది. అయినా, గ్రామం చుట్టూ కావలసినవన్నీ లభించడం వల్ల, ప్రజలు తమ దగ్గరున్నవి ఇతరులకు ఇచ్చి, వారి దగ్గర వున్న తమకు కావలసిన వస్తువులను తీసుకుంటూ వస్తువినిమయ పద్ధతి ద్వారా జీవించసాగారు.



గ్రామ సమీపంలో ఉన్న సరస్సు సంవత్సరంలో ఎనిమిది నెలలు గడ్డకట్టుకుపోవడంవల్ల, ఆ గ్రామం ఇతర ప్రాంతాల నుంచి విడిపోయి బయటి ప్రపంచంతో ఎలాంటి సంబంధం లేకుండా ఉండేది. వస్తువినిమయ పద్ధతితో కాలంగడపడం వల్ల వారికి పందొమ్మిదవ శతాబ్దంలో సైతం నాణాలంటే ఏమిటో తెలియదు. వాటిని గురించి ఎవరూ అసలు విన్నది కూడా లేదు!

ఒకరోజు ఇద్దరు గ్రామస్థులు పొలానికి వెళుతూండగా బాటపక్కన ఒక వెండి నాణెం మిలమిలా మెరుస్తూ కనిపించింది. వాళ్ళు దానిని ఆశ్చర్యంతో తీసి చూశారు. దానికి ఒకవైపున రాజుబొమ్మ, మరొకవైపున రాజముద్రిక ఉండడం చూసి మరింత ఆశ్చర్యపోయారు. ఏం చేయడానికీ తోచ లేదు. కొంతసేపు బాగా ఆలోచించాక గ్రామాధికారి దగ్గరికి తీసుకు వెళ్ళాలనుకున్నారు.

ఆ గ్రామంలోనే మంచి తెలివైన వాడుగా పేరున్న వ్యక్తి గ్రామాధికారి. ఆయన కూడా నాణాన్ని చూసి అమితాశ్చర్యం చెందాడు. అంతలో, మెరుస్తూన్న ఆ గుండ్రటి వస్తువు హఠాత్తుగా కనిపించిందన్న విషయం తెలియడంతో గ్రామ ప్రజలందరూ దానిని చూడడానికి హుటాహుటిగా గ్రామ మధ్యంలో వున్న రచ్చబండ వద్దకు చేరారు. దానిని చూసి ఏమై వుంటుందా అని రకరకాల అభిప్రాయాలు వెలిబుచ్చారు. దానిని ఏం చెయ్యాలా అని ఒకరితో ఒకరు చర్చించారు. అయినా,



విషయం తెమలలేదు. ఆఖరికి గ్రామాధికారి దానికి రేపటికి సరైన పరిష్కారం సూచిస్తానని చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి దానిని గురించి తీవ్రంగా ఆలోచిస్తూ ఒకచోట నిలకడగా నిలబడలేకపోయాడు. కూర్చోలేకపోయాడు. రాత్రంతా కంటి మీద రెప్ప వేయలేదు. తెల్లవారగానే ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు.

రచ్చబండవద్ద గుమిగూడిన గ్రామ ప్రజల నుద్దేశించి, ''మిత్రులారా, మనం ప్రప్రథమంగా చూస్తున్న అపూర్వ వస్తువు ఇది! దీనిపై రాజుగారి ముఖం ఉన్నది,'' అంటూ రాజుగారి బొమ్మకు నమస్కరించాడు.

ఆ తరవాత మళ్ళీ, ఇలా అన్నాడు: ''భగవంతుడు మనరాజుగారికి ఆయురా



# కుంకుమ పువ్వు



వాసన ద్రవ్యాలన్నిటిలోకీ చాలా ఖరీదైనది కుంకుమ పువ్వు. శ్రీనగర్ సమీపంలోని పాంపోర్ వద్ద కుంకుమ పువ్వును ప్రధానంగా పండిస్తారు. శతాబ్దాల నాటి నుంచి ఇక్కడ పొలాలలో కుంకుమ పువ్వును పండిస్తున్నారు.

కుంకుమ పువ్వు సాగుకు అనువైన భూమీ, వాతావరణ పరిస్థితులూ కాశ్మీరులో ఉన్నాయి. విడివిడిగా పూచే కుంకుమ పువ్వుల కాడ పసుపు పచ్చ రంగులో ఉంటుంది. కాడ నుంచి మూడు లేత పసుపు-ఎరుపు రంగు పుష్ప అండాలు, పుట్టుకువస్తాయి. వీటిని ఎండబెట్టి ప్రపంచంలోనే అతి విలువైన వాసన ద్రవ్యం తయారు చేస్తారు. 1 కిలో గ్రాము కుంకుమ పువ్వు తయారు చేయడానికి 150,000 పుష్ప అండాలు కావలసి వుంటుంది.

రోగ్యాలూ, సకల ఐశ్వర్యాలూ ప్రసాదించు గాక! అత్యద్భుతమైన ఈ అమూల్య వస్తువును స్వయంగా గౌరవనీయులైన మన మహారాజుగారికి కానుకగా సమర్పించుకోవడమే ఎంతో సమంజసం!''

గ్రామ ప్రజలు గ్రామాధికారి మాటను కరతాళ ధ్వనులతో ఏకగ్రీవంగా ఆమోదించారు. ఆ తరవాత ఈ విలువైన కానుకను రాజుగారికి సమర్పించడం ఎలాగా అన్న విషయంపై వాళ్ళ మధ్య వివాదం ఆరంభమయింది.

ఆఖరికి గ్రామాధికారి, ''అది చాలా విలువైన కానుక కాబట్టి మామూలుగా కాకుండా దానిని చక్కగా అలంకరించిన ఒక మేనాలో తీసుకు వెళ్ళడమే బావుంటుంది,'' అని సూచించాడు.

గ్రామస్థులు ఆరోజే మేనా తయారు చేయడానికి పూనుకున్నారు. కట్టెలు కొట్టే వారు నాణ్యమైన కలపను తీసుకు వచ్చారు. తివాసీ నేతగాళ్ళు అందమైన ఉన్ని తివాసీనీ, నేతగాళ్ళు మృదువైన పట్టు తెరనూ నేసి, వాటితో మేనాను అందంగా అలంకరించారు.

ఆ తరవాత గ్రామాధికారి మేనాను మోయడానికి ఆరుగురు పెద్దలను ఎంపిక చేశాడు. గ్రామ ప్రజలందరూ రచ్చబండ వద్ద గుమిగూడారు. గ్రామాధికారి వెండి నాణాన్ని వారందరికీ ఒకసారి చూపి, భక్తి శ్రద్ధలతో దానినొక పట్టుగుడ్డలో చుట్టి, జాగ్రత్తగా తివాసీ మీద ఉంచాడు.

అత్తవారింటికి తీసుకువెళుతూన్న కొత్త పెళ్ళి కూతురిని చూస్తున్నట్టు ఆ నాణాన్ని చూసి గ్రామస్థులు తెగ సంబరపడి పోయారు!

మేనాను సరస్సు దాటించడానికి పడవను సిద్ధం చేశారు.

రాజును కీర్తిస్తూ స్త్రీలు పాటలు పాడుతూండగా మేనాను మోసుకుపోయి

పడవలో ఉంచారు. పడవను కూడా రకరకాల పూలతో అందంగా అలంకరించారు. దూర ప్రయాణానికి కావలసిన ఆహార పదార్థాలు సమకూర్చుకున్నారు. గ్రామాధికారి పడవలో నిలబడి చేయి ఊపుతూండగా, గ్రామస్థులు ఆయనకు వీడ్కోలు పలికారు.

పడవలో మేనాకు గౌరవస్థానం ఇచ్చారు. ఎవరూ దానికేసి వీపు చూపి నిలబడడం గాని, కూర్చోవడంగాని, చేయకుండా జాగ్రత్త పడ్డారు. రాత్రి కాగానే దీపం వెలిగించారు. వారిలో ఒకరు తెల్లవార్లూ మేలుకుని దానికి కాపలా కాశారు. ఆ పడవను వదిలి వారు ఇతర పడవలగుండా వెళుతున్నప్పుడు మేనాలో ఉన్నది ఏమిటని ఎదురు పడ్డవారు అడిగితే, "రాజు గారికి విలువైన కానుక," అని చెప్పేవారే గాని, ఫలానాకానుక అని చెప్పేవారు కారు.

మూడు రోజుల ప్రయాణం తరవాత వారు రాజధానిని చేరుకున్నారు. నదీ తీరంలో ఆరుగురు పెద్దలు మేనాను తమ భుజాల మీదికి ఎత్తుకున్నారు. వారు కానుకకు గౌరవ సూచకంగా కాళ్ళ చెప్పులను కూడా తీసివేశారు. నడుము చుట్టూ తువ్వాలు చుట్టుకున్నారు. వారిలో నలుగురు మేనాను మోశారు. వారి ముందు ఒకడు రాజ పతాకాన్ని చేతబట్టి నడవసాగాడు. గ్రామాధికారి మేనా పక్కన చేతులు జోడించి వినయంగా నడవసాగాడు.

వారి వేషధారణనూ, శ్రద్ధాసక్తులనూ చూసి నగర ప్రజలు ఆశ్చర్యపోయారు. నగర ద్వారం వద్ద పన్నులు వసూలు చేసే అధికారి మేనాలో ఏముందో చూడాలన్నాడు. అయితే గ్రామాధికారి, "వీలు కాదు, మహారాజుగారే దీనిని మొట్టమొదట చూడాలి. వేరెవ్వరూ చూడకూడదు," అన్నాడు గంభీర కంఠస్వరంతో.

పన్నుల అధికారి మారు పలకకుండా వారిని నగరంలోకి అనుమతించాడు.

గ్రామస్థులు నగర వీధుల గుండా మేనాతో వెళుతుంటే, వాళ్ళేదో విలువైన కానుక రాజుగారికి సమర్పించబోతున్నారన్న వార్త నగరమంతా కారుచిచ్చులా వ్యాపించింది. నగర ప్రజలు మేనాకేసి వింతగా చూడసాగారు.

గ్రామ ప్రజలు రాజభవనాన్ని సమీపించి, తాము వచ్చిన పనిని కాపలా భటులకు చెప్పారు. ఆ సంగతి తెలియగానే, రాజు వారిని భవనంలోకి అనుమతించి తమ అతిథుల్లా సకల సౌకర్యాలూ సమకూర్చమని ఆజ్ఞాపించాడు.





తమ పట్ల చూపుతూన్న అతిథి మర్యాదలను చూసి గ్రామ ప్రజలు సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయ్యారు. రాజును వేనోళ్ళ పొగిడారు. రాజభవనంలో ప్రవేశించాక మేనాను మరింత భక్తిశ్రద్ధలతో చూడసాగారు. అందులో ఏమున్నదో తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్నప్పటికీ, అడిగితే వారికి కోపం రాగలదన్న అనుమానంతో భటులు ఊరుకున్నారు.

అదే సమయంలో, రాజభవనంలో తమకు జరుగుతూన్న గొప్ప గౌరవ మర్యాదలు చూసి, గ్రామాధికారి, "ఇప్పుడే ఇలా ఉంది కదా? మనం తెచ్చిన ఆ కానుకను చూశాక మహారాజుగారు సంతోషించి ఎలాంటి బహుమానాలు ఇచ్చి సత్కరిస్తారో, ఏమో," అని తనవారితో అన్నాడు ఎంతో ఆనందంగా.

మధ్యాహ్నం భోజనం, విశ్రాంతి అయ్యాక, రాజు గ్రామస్థుల కోసం కబురు చేశాడు. ప్రధాన మంత్రీ, ముఖ్యమైన రాజోద్యోగులూ విశాల మంటపంలో రాజుగారితోపాటు ఉన్నారు.

మొదట గ్రామాధికారి అక్కడికి వచ్చి రాజుకు తలవంచి నమస్కరించాడు. మేనాను మోసుకు వచ్చిన పెద్దలు నేలపై దించి, చేతులు జోడించి వినయంగా నిలబడ్డారు. ఆ తరవాత గ్రామాధికారి రాజుతో, "సుదూర ప్రాంతంలో సరస్సు అవలనున్న గ్రామం నుంచి మేము వచ్చాము. మా గ్రామ పెద్దలతో కలిసి నేను మీ కొక అసాధారణమైన కానుకను తెచ్చాను. ఆ కానుకను తమ పాద పద్మాలచెంత సమర్పించడానికి తమ అనుమతిని వేడుకుంటున్నాము," అన్నాడు.

"చాలా సంతోషం. అంతదూరం నుంచి ఈ కానుకను ఇక్కడికి తీసుకురావడానికి మీరుపడ్డ శ్రమ, మీరు నా పట్ల చూపుతున్న విశ్వాసాన్నీ, ఆదరాభిమానాలనూ చాటుతున్నది. ఇప్పుడే మీరు ఆ కానుకను ఇవ్వవచ్చు," అన్నాడు రాజు మందహాసం చేస్తూ.

గ్రామాధికారి మేనా తెరను తొలగించి, చేయి లోపలికి పెట్టాడు. విస్మయంతో ఆయన ముఖం రంగులు మారసాగింది. మేనా నాలుగు వైపులా వున్న తెరలను తొలిగించి మేనా లోపల ఆదరా బాదరా వెదికాడు. పెద్దలను పిలిచి వాళ్ళ చెవిలో ఏదో గుసగుసలాడాడు. పెద్దలు కూడా మేనా చుట్టూచేరి వెదకసాగారు. కానీ, ఏదీ

దొరక లేదు. విలువైన కానుకను కనుగొన లేక పోయారు!

ప్రధాన మంత్రి ఓర్పు నశించి, "ఎంత సేపని వెతుకుతారు? మహారాజుగారికి అవతల చాలా పనులున్నాయి!" అని హెచ్చరించాడు.

గ్రామస్థులు ఏమీ తోచక దిక్కులు చూడసాగారు. వాళ్ళు మేనాను మోసుకు వచ్చే సంబరంలో అందులోని విలువైన కానుక ఎక్కడ పడిపోయిందో కూడా గమనించలేదు!

రాజును ఇంతగా అవమానించి నందుకు వారిని కఠినంగా శిక్షించాలని ప్రధాన మంత్రి, వారిని జైల్లో పెట్టడానికి రాజుగారి అనుమతి కోరాడు.

"అల్పులమైన మేము మహాప్రభువు లయిన తమరిని అవమానించడమా! క్షమించండి ప్రభో! అసలు ఏం జరిగిందో చెప్పడానికి నన్ను అనుమతించండి," అని ప్రాథేయపడ్డాడు గ్రామాధికారి.

వాళ్ళు వట్టి అమాయకులనీ, నిజం గానే కానుక ఇవ్వడానికి వచ్చారు తప్ప తనను అవమానించటానికి రాలేదనీ రాజు గ్రహించాడు. అయితే, వాళ్ళ అమాయ కతను పరీక్షించాలని రాజు నిర్ణయిం చాడు.

వాళ్ళందరినీ ఒక గదిలో ఉంచి వాళ్ళనే వంటచేసుకోమని కావలసిన కాయకూర లను, వంట సామగ్రినీ ఇవ్వమని రాజు ఆజ్ఞాపించాడు. మండుతున్న నిప్పు కణిక లకు బదులు, వాళ్ళకు ఒక అగ్గిపెట్టె ఇచ్చేలా చేశాడు.

అమాయకులైన ఆ గ్రామస్థులకు అగ్గి పెట్టెతో నిప్పు పుట్టించడం తెలియలేదు. అందువల్ల పచ్చికాయగూరలను, ఆహార పదార్థాలను అలాగే తిని, ఆకలి చల్లార్చు కున్నారు.

దీనిని గురించి విన్న రాజుకు వాళ్ళ అమాయకత్వం అర్థమయింది. వాళ్ళను పిలిపించి జరిగినదంతా అడిగి తెలుసు కున్నాడు. ఆ తరవాత గ్రామాధికారి చేతికి ఒక వెండి నాణాన్ని ఇచ్చి, దానిని తిరిగి తీసుకుంటూ, "ఇప్పుడు మీ విలువైన కానుకను పుచ్చుకున్నాను. సంతోషమే కదా?" అన్నాడు.

తర్వాత రాజు వాళ్ళకు తగిన బహుమతులిచ్చాడు. గ్రామంలో భూమి శిస్తును తగ్గించాడు. రాజుకు కృతజ్ఞతలు తెలియజేసి వారు సంతోషంగా గ్రామానికి తిరుగు ప్రయాణమయ్యారు.



# మనదేశం గురించి తెలుసుకుందాం - క్విజ్

1. పశ్చిమ బెంగాల్‌లోని చిత్తరంజన్‌లో రైలు ఇంజనులు తయారుచేస్తున్నారు. అక్కడ మొట్టమొదటి రైలు ఇంజను ఎప్పుడు తయారు చేయబడిందో తెలుసా ?
   ఎ. 1950-51 బి. 1955-56
   సి. 1959-60 డి. 1961-62

2. అశోకుడి శిలాశాసనాలు ఏ భాషలో లిఖించబడ్డాయి ?
   ఎ. మాగధి బి. బ్రాహ్మి
   సి. సౌరసేని డి. పాళీ

3. 'ఆలిండియా హరిజన్ సంఘ్' స్థాపకుడు ఎవరు ?
   ఎ. బి.ఆర్.అంబేద్కర్ బి. గాంధీజీ
   సి. జగ్జీవన్‌రామ్ డి. డి.కె.కార్వే

4. ఈ మహనీయులలో 'చర్మకారుల' కులానికి చెందిన వారెవరు ?
   ఎ. కబీర్ బి. సాధన
   సి. రవిదాస్ డి. నామదేవుడు

5. అతిపెద్ద కేంద్రపాలిత ప్రాంతం ఏది ?
   ఎ. ఢిల్లీ
   బి. పాండిచ్చేరి
   సి. అండమాన్, నికోబార్ దీవులు
   డి. చండీఘడ్



6. ఈ చిత్రంలో ఉన్న జాతీయ నాయకుడు ఎవరు ?

7. ముస్లింలు రోజుకు ఎన్నిసార్లు 'నమాజు' చేయాలని చెబుతారు ?
   ఎ. రెండు సార్లు
   బి. మూడుసార్లు
   సి. నాలుగుసార్లు
   డి. ఐదుసార్లు

8. అత్యధిక సంఖ్యలో ఫ్యాక్టరీలు ఉన్న రాష్ట్రం ఏది ?
   ఎ. తమిళనాడు
   బి. మహారాష్ట్ర
   సి. గుజరాత్
   డి. ఆంధ్ర ప్రదేశ్

(సమాధానాలు వచ్చే సంచికలో)

## అక్టోబర్ క్విజ్ సమాధానాలు

1. చట్టీస్‌ఘడ్, రాయ్‌పూర్
2. రాజస్థాన్
3. లార్డ్ హార్డింజ్
4. సుందర్‌లాల్ బహుగుణ
5. కర్నూలు
6. 1919



# విఘ్నేశ్వరుడు

సొలలో ఇంత గొడవ జరుగుతున్నా, పాలేరు ఇంకా నిద్రిస్తూనే ఉన్నాడు. పక్కనే పత్రిపూలతో నిండిన గణేశ విగ్రహం ఉంది. నేలంతా చెరుకు పానకంతో బురద, బురదగా బాగా తడిసి ఉంది.

కాపలావాళ్ళను పిలిపించి అడిగితే వాళ్ళు, "చాలా రాత్రయింది, పాలేరు నిశ్చింతగా నిద్ర తీస్తున్నాడు, మాకూ కునుకొచ్చింది. అంతలో ఏనుగు అరుపుతో కళ్ళు తెరిచాము. పెద్ద ఏనుగు చీకట్లోతెల్లగా కనిపించింది. చెరుకంతా లాగి మేసేస్తున్నది, గానుగలాగ పిప్పంతా ఊసేస్తున్నది; మాకు చెడ్డ భయమేసింది. పారిపోయాం!" అంటూ వాళ్ళింకా భయంతో వొణికి పోతూనే చెప్పారు.

భూస్వామిలో గొప్ప పరివర్తనం కలిగింది. అలాగే వెళ్ళి పాలేరు పాదాలకు మొక్కు తూన్నట్టు సాగిలపడిపోయాడు. పాలేరు మేల్కొన్నాడు. లేచి నుంచున్నాడు. భూస్వామి అతని పాదాలు వదలకుండా శిరస్సుతో మొక్కుతూనే ఉన్నాడు.

భూస్వామి భార్య విఘ్నేశ్వర విగ్రహానికి ప్రణమిల్లి, "స్వామీ! ఇన్నాళ్ళకు మమ్మల్ని అనుగ్రహించావు. ధన్యులం!" అని అంటూ జరిగిందంతా పాలేరుకు చెప్పింది.

మహాద్భుతాన్ని విన్న జనం తండోప తండాలుగా అక్కడికి చేరుకుంటున్నారు. దివాణం క్రిక్కిరిసిపోయింది. నేలపై ఏనుగు పాదాల గుంటల్లో నిలిచిఉన్న చెరుకు రసాన్ని తీర్థంగా సేవిస్తూ, చెరుకు పిప్పిని విఘ్నేశ్వర మహాప్రసాదంగా పట్టుకువెళ్తు న్నారు.

పాలేరు, భార్య పిల్లవాడితో కలిసి వినాయక విగ్రహానికి దణ్ణాలు పెడుతూ, "చిన్న పత్రి పిసరైనా వేసి నిన్నెన్నడూ పూజించలేదు. నీ కోసమని పంపిన చెరుకు



నీకు పెట్టనైనా లేదు. నా కోసం ఎందు కింత శ్రమపడ్డావయ్యా? ఏనుగు రూపం తోనైనా అందరికీ కనిపించావు, నాకు కని పించావు కావు. నువ్వు వచ్చినప్పుడు నిద్దర పోయిన దద్దమ్మను!'' అంటూ పిల్లవాడి లాగ బావురుమన్నాడు.

అప్పుడు విగ్రహం స్థానంలో చెరుకుగడ పట్టుకొని, విఘ్నేశ్వరుడు పాలేరు ముందు సాక్షాత్కరించాడు. పాలేరు కొడుకు తీసుకు వెళ్ళిన చెరుకుగడే అతని చేతిలో ఉంది!

విఘ్నేశ్వరుడు పాలేరును తన తొండంతో దగ్గిరకు తీసుకొని, అభయహస్తంతో అతని తల నిమురుతూ, ''నాయనా! కులాలు, జాతులు ఆచారాలు నేను పెట్టినవి కావు. అంతా ఈ మాయదారి మనుషులు కల్పించు కున్నవే. నా దగ్గిర ఎక్కువ తక్కువలకు చోటు లేదు! అందుకే నీకు కనిపించాను!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

జనులందరూ చేతులెత్తి జోడిస్తూ పాలే రుతో, ''నీ మూలంగా మాకు గణేశుని దర్శన భాగ్యం కలిగింది,'' అంటూ పదే పదే మ్రొక్కుతూ బ్రహ్మరథం పట్టారు.

''ఇక్షు అంటే చెరుకు, సహస్ర-ఇక్షు, వెయ్యి చెరుకుల గణపతి; సహస్రేక్షు గణ పతిగా విఘ్నేశ్వరుడు కీర్తింపబడ్డాడు. చెరుకు గడ పట్టుకొన్న వినాయక విగ్రహం ప్రతిష్ఠింప బడి అక్కడ గొప్ప ఆలయం వెలిసింది,'' అని పావనమిశ్రుడు కథ ముగించాడు.

ఆలయ మంటపంలోని చిత్రాల కథ లన్నీ పావనమిశ్రుడు చెప్పాడు గాని ముఖ ద్వారం మీద చిత్రింపబడినది మాత్రం మిగిలి ఉంది. అది చాలా పెద్ద చిత్తరువు. మంటపం లోని చిత్రాలన్నీ ఒక ఎత్తు అది ఒక్కటి ఒక ఎత్తు! చిత్రలేఖన ప్రతిభ అంతా అందులో ఉంది. ప్రతి రోజూ ఆ చిత్రాన్ని పరీక్షగా నిల్చుని చాలాసేపు తదేకంగా చూస్తూండే యువకుడొకడు పావనమిశ్రుడి పాదాలకు నమస్క రించి, ''మహాశయా! ఈ ఆలయ మంటపంలోని చిత్రాలను ఎవరు చిత్రించారు? ఆ మహా శిల్పి చరిత్ర ఏమైనా ఉంటే చెప్పండి! ఆ ముఖద్వారం మీద వున్న చిత్రానికి నా కళ్ళూ, మనస్సూ అంకితమైపోయాయి. ఆ చిత్తరువు గురించిన గాథ కూడా దయతో చెప్పి చిత్ర చరిత్ర సంపూర్ణం చెయ్యండి!'' అన్నాడు.

పావనమిశ్రుడు ఆ యువకుణ్ణి సాద రంగా చూసి, ''నాయనా! చూడగా నువ్వూ చిత్రకారుడిలాగ కనిపిస్తున్నావు! ముఖ ద్వారం మీది చిత్తరువు నాకూ అభిమాన

చిత్రమే. దాని గాథ తర్వాత చెప్పి విఘ్నేశ్వర చరిత్ర సంపూర్ణం చేస్తాను! నువ్వడిగిన చిత్ర శిల్పికి చరిత్ర లేకపోలేదు, ఉంది!'' అంటూ కన్నులు మూసి ఏదో గుర్తు తెచ్చుకుంటు న్నట్లు ధ్యానించి, కాస్సేపైనాక చెప్పడం ప్రారంభించాడు:

వాతాపి నగరానికి సాధువుల గుంపుతో పధ్నాలుగేళ్ళప్రాయంగల వాడొకడు వచ్చి వాతాపి గణపతి ఆలయం వదలకుండా అలాగే ఉండిపోయాడు.

అతని ఊరేదో పేరేదో అతనికే తెలియదు. అతని నుదుట పెద్ద గాయం మానిన గుర్తు చూసి, పాపం ఏదో దెబ్బ తగిలి స్మృతి పోగొట్టు కొన్నవాడులాగుంది, అని అంతా అనుకున్నారు. ఆ బాలుడు మూగవాడా అన్నట్లు అట్టేమాట్లాడే వాడు కాడు. గోడల మీద బొమ్మలు గీస్తుండే వాడు. మంటపం రాతిపలకల నేలమీద సుద్దతో బొమ్మలు గీస్తూండేవాడు. గీస్తూన్నంత సేపూ అతని ముఖం పూర్ణచంద్రబింబంలాగ నవ్వుతూ వెలుగుతూండేది. అంచేత చిత్రా నందుడు, చిత్రముఖుడు అనీ, అతడు ఎక్కు వగా విఘ్నేశ్వరుడి బొమ్మల్నే వేస్తూండడం వల్ల విఘ్నేశ్వర చిత్రకారుడు అనే పేరును లుప్తాక్షరిగా విచిత్రుడు అని అక్కడివారు అంటూండేవారు.

అప్పటికి గజాననపండితుడు చాలా వృద్ధు డయ్యాడు. రోజూ సాయంత్రం ఇంటి దగ్గిర పిల్లలకు విఘ్నేశ్వరుడి కథలు చెప్పు తూండే వాడు. విచిత్రుడు ఆ కథలను అతిశ్రద్ధగా అరుగుమీద చెవికోసుకొని వింటూండేవాడు. కథ విన్న మర్నాడు ఆ కథకు సంబంధించిన చిత్రం ఏ గోడ



మీదనో కనిపించేది. గజానన పండితుడికి విచిత్రుడి మీద చాలా వాత్సల్యం. ఇంటి లోపలికి పిల్చినా విచిత్రుడు గడపమీద ద్వారం వెలుపలే కూర్చుని వింటూ, ''స్వామీ, ఇక్కడ కూచుని వింటేనే నాకొక్కడికే చెబుతున్నట్లు ఎంతో బాగా వినిపిస్తున్నది!'' అనేవాడు. విచిత్రుడు చిత్రించే విఘ్నేశ్వరుడి బొమ్మలు చూసి గజాననుడు మురిసిపోతూ, విఘ్నేశ్వ రుడికి సంబంధించిన అనేక కథలను ప్రత్యేకంగా అతనికి చెబుతూండేవాడు.

విచిత్రుడి వెనక ఎప్పుడూ పిల్లలు గుంపు లుగా ఉండేవారు. అతను బొమ్మలు వేస్తూంటే నిశ్శబ్దంగా చూసి ఆనందిస్తూ, తర్వాత చిన్న చిన్న బొమ్మలు వేస్తూండేవారు. ఊళ్ళో పిల్లలకు చిత్రకళ అబ్బింది.

విచిత్రుడు పగలంతా వీధుల్లో గోడల మీద జేగురుముక్కతోనో, సుద్దరాయితోనో బొమ్మలు



వేస్తూ, వాతాపి గణపతి ఆలయంలో పంచే ప్రసాదంతో గడిపి, రాత్రి ఆలయ మంటపం మెట్ల మీద ఓ వారగానో, ఊరి చివరనున్న వాడలో ఏ పంచకిందనో ఆదమరిచి నిద్ర పోయేవాడు.

ఆ వాడలో కుమ్మరులు, చర్మకారులు, పంచములు మొదలైనవారుండేవారు. విచిత్రుడంటే ప్రాణం పెట్టేవారు. ఏ అపరాత్రి వేళ విచిత్రుడు వచ్చినా అతని కోసం ఉంచిన దాన్ని పెట్టి తినిపించి మరీ విచిత్రు డికి పడక సదుపాయం చేసి ఆ తరువాతే నిదుర పోయేవాళ్ళు.

ఆ విధంగా విచిత్రుడు పెరిగి పెద్దయ్యాడు.

తానెవరో తనకే తెలియకుండా మరిచి పోయిన విచిత్రుడికి అన్నలూ తల్లీ తండ్రీ అందరూ ఉన్నారు!

వాతాపి నగరానికి కొంత దూరంలో ఉన్న ఒక ఊళ్ళో మధ్యతరగతి కుటుంబంలో విచిత్రుడు పుట్టాడు. తండ్రి మూలంగా అతనికి అతి బాల్యంలోనే బొమ్మలు గీయడం అబ్బింది. బొమ్మలు వెయ్యడానికే పుట్టాడా అన్నట్లు ఆ కుర్రవాడికి మరేది అబ్బలేదు. అన్నలు, వదినలు అతణ్ణి ఈసడించుకొని ఇంటినుంచి తరిమేశారు. కుర్రవాడికి విఘ్నేశ్వరుడంటే చాలా ఇష్టం. వాతాపి నగరానికి బయలుదేరివస్తూ, తిండీ తిప్పలు లేని నీరసంతో మార్గంలో ఒక కరుకు రాతి మీద పడిపోయాడు. దెబ్బ తగిలి తెలివి తప్పి పడిఉన్న అతణ్ణి సాధువులు కొందరు కాపాడి తమ వెంట వాతాపి నగరానికి తెచ్చారు. అదీ విచిత్రుడి బాల్యచరిత్ర.

ఆ ఏడాది వాతాపి నగరంలో వినాయక చతుర్థి ఉత్సవాలకు ఒక చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు జరిగింది.

నిలువెత్తు వినాయక విగ్రహాలను చిత్ర కళా ప్రతిభ కనపరుస్తూ రంగులు వేసి ప్రదర్శనలో పెట్టాలి. అన్నిట్లో గొప్పగా ఉన్న విగ్రహాన్ని వెయ్యి బంగారు కాసులకు నవరాత్రి ఉత్సవాలు నిర్వహించేవారు కొంటారు. రత్నఖచిత స్వర్ణకంకణాన్ని నగర పాలకులు చిత్రకారుడికి బహూకరిస్తారు.

ఆ పోటీ ప్రదర్శనకు ఆస్థాన చిత్ర కారులూ, గొప్ప గొప్ప చిత్రకళా నిపుణులూ చాలా మూల్యాన్ని వెచ్చించి దేశాంతరాల నుంచి తెప్పించిన రంగులు, బంగారు పూతలు, రంగురంగుల మెరుపురేకులు, రంగురాళ్ల పొళ్ళు ఉపయోగించి, మెరుగుపూత పెట్టిన విఘ్నేశ్వర విగ్రహాలను ప్రదర్శనలో పెట్టారు.

విచిత్రుడికి ఒక కుమ్మరి మిత్రుడున్నాడు. విచిత్రుడు దగ్గిరుండి చెప్పిన విధంగా అతడు బంకమట్టితో విఘ్నేశ్వర విగ్రహాన్ని

చేశాడు. విచిత్రుడు సున్నము, మసి, జేగురు, పచ్చమట్టి, ఆకుపసర్లను ఉపయోగించి విగ్రహానికి రంగులు దిద్దాడు.

విచిత్రుడు రంగులు వేసిన ఆ విగ్రహాన్ని చిత్రకార ప్రముఖులు ప్రదర్శనలో పెట్టనివ్వలేదు. విచిత్రుడు ప్రదర్శన నిర్వాహకులతో, "అయ్యా! దయతో చిట్ట చివర్న నా విగ్రహాన్ని కూడా ఉంచండయ్యా! ఉడతాభక్తిగా నేను కూడా నాకు వచ్చినంతగా విఘ్నేశ్వరుడికి రంగులు వేశానని అనుకుంటూ, ఆ గొప్ప గొప్ప విఘ్నేశ్వరుల సరసన నా విఘ్నేశ్వరుడు కూడా ఉంటే చూసుకోవాలని ఉందయ్యా! అంతకు తప్ప మరే కోరికా లేదు!" అని ఎంతో ప్రాధేయపడ్డాడు.

కానీ, "కులగోత్రాలు, ఊరూ పేరూ లేనివాడివి, కడజాతులతో తిరిగేవాడివి. అలాంటి నీ చేతుల్లో తయారైన విగ్రహానికి వంశప్రతిష్ఠలుగల ప్రఖ్యాత మహా చిత్రకారుల విగ్రహాల సరసన ప్రదర్శించడానికి అర్హత లేదు!" అని నొక్కివక్కాణించారు ప్రదర్శన నిర్వాహకులు. విచిత్రుడు చాలా విచారపడ్డాడు.

కుమ్మరి మిత్రుడు, "ప్రదర్శన పందిట్లో పెట్టకపోతే పోయారు, మనం విగ్రహాన్ని వేరేచోట పెడదాం పద!" అని విచిత్రుడికి నచ్చజెప్పి, ప్రదర్శనశాలకు దగ్గర్లో ఉన్న ఒక అరటిచెట్టు మొదట విగ్రహాన్ని పెట్టి, విచిత్రుణ్ణి తనతోబాటు అక్కడ కూర్చుండబెట్టుకున్నాడు.



ప్రదర్శనశాలలో పెద్దవాళ్ళు విగ్రహాలను చూస్తూ, గుంపులు గుంపులుగా చేరి, విగ్రహాలకు ఉపయోగించబడిన రంగుల విలువల గురించి, చిత్రకారుల పదవీ కుల గోత్రాల గొప్పలూ చెప్పుకుంటూ ఉంటే, పిల్లలంతా విచిత్రుడి వినాయక విగ్రహం దగ్గిరికి చేరి హర్షధ్వానాలు చేస్తూ ఆసక్తితో చూస్తున్నారు.

ఆ సమయంలో ఆకాశం నుంచి జారి పడ్డ జంటమెరుపుల్లాగ ఉన్న ఇద్దరు తరుణులు, ప్రదర్శనశాలకు వచ్చారు. వారు నిండుగా ధరించిన రత్నా భరణాల కాంతి మిరుమిట్లు గొల్పుతున్నది.

జనం వారిని చూసి విస్తుబోతూంటే, పెద్దామె, "కళానంద నగరం మాది. మాకు నచ్చిన వినాయక విగ్రహం కోసం పదివేల వరహాలు పట్టుకుతిరుగుతున్నాం!" అంటూ చేతనున్న బంగారు జలతారు అల్లికసంచిని గలగల్లాడించింది.

అక్కడ ఉన్న చిత్రకారులు చరచరా వారి వారి విగ్రహాల దగ్గిరికి వెళ్ళి నిల్చున్నారు.

"మా అక్క ప్రసన్నవదన గొప్ప గాయనీ మణి. అంతేకాదు, గొప్ప తిండిపోతు. నైవేద్యపుష్టి, విగ్రహపుష్టి తర్వాతనే గాత్రపుష్టి. బొజ్జపెంచి పాడి చూడు, అనే గాయక సిద్ధాంతాలకు తార్కాణం మా అక్క ప్రసన్నవదన!" అంటూ సుకుమారంగా సమ్మోహనాస్త్రంలాగున్న చిన్నామె కాలి మువ్వలు ఘల్లుమనిపించింది.

"మా చెల్లి మోహన గొప్ప వాగుడు కాయ, అంతకంటె గొప్ప నర్తకీమణి! చూడ్డానికి చిన్నారి చిట్టిలాగుందే కాని, నన్నే అవలీలగా ఎత్తి తిప్పేస్తుంది! అద్భుతమైన అంత శక్తి సామర్థ్యాలున్నాయి ఆ చిన్నదానికి. నృత్యంలో దాని చురుకుదనం చూడశక్యం కాదు!" అని ప్రసన్న వదన చెప్పింది.

"మా చేత పాడించడం, ఆడించడం, ఆ ఇంద్రుడికీ, కుబేరుడికీ సాధ్యం కాదు. అలాంటి ఆటపాటల్ని, మాకు కావలసిన విగ్రహం ముందు జరుపుతామని మొక్కుకున్నాం!" అని మోహన చెప్పింది.

వారి మాటలకు పరవశించిపోతూన్న జనం మంత్రించినట్లుగా పక్కకు తప్పుకుని విశాలంగా దారి చేశారు.

– (వచ్చే సంచికలో ముగింపు)





# జయసింహుడి కథ

విజయపురిని పరిపాలించే శ్యామసింహుడికి, ఒక్కగానొక్క వారసుడు జయసింహుడు. విశాలమైన తనరాజ్యాన్ని, చుట్టుపక్కల గల చిన్న చిన్న రాజ్యాలను కూడా తన ఆధీనం లోకి తెచ్చుకుని, విజయపురిని మరింత విశాలమైనదిగా మలిచాడు శ్యామసింహుడు. శస్త్రాస్త్ర విద్యలనూ, రాజనీతినీ సమగ్రంగా నేర్చుకున్న తన కొడుకు జయసింహుడు, తనంతవాడు కావాలని ఆయన కోరిక. కానీ, యువరాజు జయసింహుడు మాత్రం ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, బొమ్మలు చిత్రిస్తూ, తన రాజ భవనంలోపలే ఎక్కువ కాలం గడపసాగాడు.

అతణ్ణి ఉల్లాసవంతంగా వుంచడం కోసం, శ్యామసింహుడు అద్భుతమైన నాట్య కత్తెలతో నయనానందకరమైన నృత్య కార్య క్రమాలూ, సంగీత విద్వాంసులను రావించి అద్భుతమైన సంగీత సభలనూ ఏర్పాటు చేయించాడు. ఎన్ని చేసినా జయసింహుడి ప్రవర్తనలో మార్పు ఏమాత్రం రాలేదు.

అతడు అప్పుడప్పుడూ రాజ్యానికి దక్షిణ దిశలో వున్న కొండ ప్రాంతాల్లోని అందమైన కోనలలో ప్రకృతి దృశ్యాలను చూస్తూ కొన్నాళ్ళు గడిపి, రాజాంతఃపురానికి తిరిగి వచ్చేవాడు. రాజుకు జయసింహుడిలోని ఈ వింత ప్రవర్తన గురించి తెలుసు.

ఒకనాడు శ్యామసింహుడు, కొడుకును పిలిపించి, "నాయనా! నీ స్తబ్దతకూ, జీవితం పట్ల అనాసక్తికీ కారణం తెలియడం లేదు. ఉప్పొంగే సముద్రంలో ఉవ్వెత్తుకు లేచే అలల్లాంటి ఈ వయస్సులో, నువ్వు ఇంత మందకొడిగా దేనిపట్లా ఏమాత్రం ఇష్టం కనబరచకుండా పరధ్యానంగా వుంటున్నావు. కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

అందుకు జయసంహుడు, "నాన్న గారూ! ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు. నాకు ఈ అంతఃపుర ఆడంబరాల మీదా, విలాస జీవితం పట్లా విసుగెత్తిపోయింది. ఏదో కొత్తదనాన్ని నా మనసు కోరుకుంటు న్నది. నేను కొన్నాళ్ళ పాటు రాజభవనానికి

ఎస్. కమలాదేవి



దూరంగా వుండి దేశాటన చేసివస్తాను, దయ చేసి అనుమతించండి!'' అని కోరాడు.

దానికి శ్యామసింహుడు వెంటనే జవాబివ్వకుండా కొంతసేపు ఆలోచించి, ''నాయనా! నువ్వు విజయపురికి కాబోయే రాజువు. నా మాటవిను. ఈ చిత్రపటాలను చూసి ఏదో ఒక కన్యను ఎన్నుకుని వివాహం చేసుకో. వైవాహిక జీవితం నీలో ఉత్సాహాన్నీ, రాజ్య వ్యవహారాల పట్ల ఆసక్తినీ తప్పక కలిగిస్తుంది. ఇది నా నమ్మకం, నీకు నా ఆజ్ఞ కూడా!'' అన్నాడు.

తర్వాత శ్యామసింహుడు, కొడుకు వెంట రాగా దేశదేశాల రాకుమార్తెల చిత్ర పటాలను భద్రపరచిన కళామందిరంలోకి దారితీశాడు. అక్కడ సౌందర్యంలో ఒకరిని మించిన మరొకరు గల నిలువెత్తు రాకుమార్తెల చిత్ర పటాలున్నవి. కానీ, జయసింహుడు ఆ చిత్రపటాల్లోని రాకుమార్తెల్లో ఎవరికేసీ ఆసక్తిగా చూడలేదు. ఇది పనికాదని, రాజు శ్యామసింహుడు, అందాలరాశి అయిన సాకేతపురి రాకుమార్తెను, జయసింహుడికి కాబోయే భార్యగా నిర్ణయించాడు.

అతికొద్ది కాలంలోనే జయసింహుడి వివాహం జరిగిపోయింది. ఐతే, అదే రోజు రాత్రి కొత్త పెళ్ళికూతురు భర్త కోసం ఎదురు చూస్తూంటే, అతడు మాయమైపోయాడు. ఈ అవాంతరం అతడి భార్య మరుద్వతీ దేవిని దుఃఖసాగరంలో ముంచింది. ఆమె కేవలం జయసింహుడి చిత్రపటాన్ని మాత్రమే చూసింది. కోరమీసాలతో, పోత పోసిన కాంచన విగ్రహంలా, వీరత్వం మూర్తీభవించినట్లున్న జయసింహుడి పట్ల ఆమె ఆకర్షితురాలైంది.

తమ ఆచారం ప్రకారం కత్తికి తాళి కట్టించి కళ్యాణం జరపడం వలన, ఇంత వరకూ ఆమె, అతణ్ణి చూడలేదు.

ఆ విధంగా, రాత్రికి రాత్రే అదృశ్యమైన జయసింహుడు, తన పంచకళ్యాణిలాంటి గుర్రాన్నెక్కి రెండు రాత్రుళ్ళూ, రెండు పగళ్ళూ ప్రయాణం చేసి చాలా దూరం వెళ్ళాడు. అలసట, ఆకలి, దాహం భరించ లేని స్థితిలో, ఆ మునిమాపువేళ నీటి కోసం వెదకసాగాడు. అడవిలో చెట్టుచేమలు కాస్త పలుచగా వున్న చోట, అతడికి ఒక అంద మైన కోనేరు కన్పించింది.

జయసింహుడు గుర్రందిగి కోనేటికి పోబోతూ చప్పున ఆగిపోయాడు. స్వచ్ఛమైన కోనేటి నీటిలో కలువ పువ్వులా తేలియాడు తున్న ఒక అద్భుత సౌందర్యవతి! ఆ యువతిని చూసిన జయసింహుడు ఒక్క

క్షణం తనను తాను మరిచిపోయాడు. కొద్ది సేపటికి ఒడ్డుకుచేరిన యువతి, అతణ్ణిచూసి గట్టిగా అరువబోయింది. ఐతే, జయసింహు డామెకు, తననుంచి ఎలాంటి హానీ కలగ దన్నట్టు సైగ చేశాడు.

తర్వాత అతడామెనుసమీపించి మృదు వుగా, "సుందరీ, భయపడకు! నేను పర దేశిని, దాహార్తుడిని. ఇంతకూ నువ్వెవరవి? గంధర్వకన్యవా? కిన్నెరవా? నువ్వెవరివో తెలుసుకోవాలని వుంది," అన్నాడు.

జయసింహుడు ఇలా అనగానే, ఆ యువతి స్థిమితపడి, "నా పేరు వెన్నెల. ఈ దాపులనే నివసిస్తున్న ఒకచిన్న సామంతరాజు కుమార్తెను. మీరిక్కడి నుంచి తక్షణం వెళ్ళి పోవడం, మీకెంతైనా క్షేమం!" అన్నది.

ఆ మాటలతో అంత వరకూ స్తబ్దంగా వున్న జయసింహుడిలో ఉల్లాసం,ఉత్సాహం పెల్లు బికింది. ఏదిఏమైనా సరే, తను కొన్నాళ్ళు అడవిలో, దాపులనున్న కొండ గుహల్లో, చెట్టు చేమల మధ్య ప్రకృతిలో కలిసిపోయి ప్రశాంతంగా బ్రతకాలనుకున్నాడు.

అతడు తన కోరిక చెప్పగానే, వెన్నెల తనవాళ్ళు ఏదైనా హాని కలిగించవచ్చని మరొకసారిచెప్పింది. ఐనా,జయసింహుడు కాదు కూడదని మొండికెత్తడంతో, అతణ్ణి కొంచెందూరంలో వున్న కొండ గుహలో వుండమనీ, రోజూ వేళకు తినేందుకేమైనా తేగలననీ చెప్పి అక్కడి నుంచి హడావుడిగా వెళ్ళిపోయింది.

ఆ రోజు నుంచీ వెన్నెల, జయసింహుడికి, తన నివాసస్థానం నుంచి మామూలు భోజ నంతోపాటు అడవిలో దొరికే రుచికరమైన పళ్ళూ,తియ్యని తేనెలాంటివి తెచ్చి ఇవ్వ సాగింది.



ఒక నాడామె, చిత్రలేఖనానికి అవసరమ యిన రంగులూ, కుంచెలూ తెచ్చి, వాటిని కొన్నాళ్ళ క్రితం ఎవరో అడవిలో మరిచి పోయి వెళ్ళారనీ, అతడికేమైనా ఉపయో గించగలవేమో అని తెచ్చాననీ చెప్పింది.

చిత్రలేఖనానికి అవసరం అయిన ఆ వస్తుసామగ్రి జయసింహుడికి ఎంతో ఉత్సాహం కలిగించినై. అతడు వెంటనే కుంచెను అందుకుని అప్సర కన్యలాంటి వెన్నెలను అనేక భంగిమలలో చిత్రించాడు.

ఇలా వారం గడిచింది. ఒకనాటి సూర్యో దయంవేళ వెన్నెల ఏదో వ్యాకులపడుతూ న్నట్టు జయసింహుడివద్దకు వచ్చి, "స్వామీ! మీరు మరెక్కడికైనా వెళ్ళిపొండి. మా వాళ్ళకు మీ ఉనికి తెలిసిపోయింది. ఏ ఆయుధం లేకుండా, మీరు వాళ్ళను ఎదిరించలేరు," అన్నది.

అందుకు, జయసింహుడేమాత్రం తొణకకుండా, "వెన్నెలా! నాలోని నిరుత్సా హాన్నీ, స్తబ్దతనూ పారదోలి నాకు ప్రాణం పోసిన అమృతమూర్తివి నువ్వు. నిన్ను వదిలి ఒక్క క్షణం కూడా నేనుండలేను. నిన్ను రాజధానికి తీసుకుపోయి, నా తల్లిదం డ్రుల అనుమతితో వివాహమాడతాను," అన్నాడు.

ఆ మరుక్షణం చెట్లచాటునుంచి నవ్వుతూ బయటికి వచ్చిన మహారాజు శ్యామసిం హుడు, జయసింహుడికేసి ఆప్యాయంగా చూస్తూ, "నాయనా! నీ అభీష్టం తప్పక సిద్ధిస్తుంది. ఈమె మరెవరో కాదు, నీ ధర్మపత్ని మరుద్వతి!" అన్నాడు.

అవునా? అన్నట్లు ఆశ్చర్యంగా తనకేసి చూసిన జయసింహుడికి తలవంచి నమ స్కరిస్తూ, మరుద్వతీదేవి, "స్వామీ! నన్ను మన్నించండి. నేను మరుద్వతినే! స్వేచ్ఛ కోసం పరితపించే మిమ్మల్ని అనుస రించి, ఈ అడవికి చేరాను. నా పత్నీ ధర్మం నిర్వర్తిం చాను. ఇందులో తప్పేమైనా వుంటే మన్నించ మని మరొకమారు కోరుతున్నాను, ఈ జరి గినదంతా మహారాజుగారి ఆదేశాను సారమే," అన్నది.

ఆ తర్వాతనెల తిరక్కుండానే రాజు శ్యామ సింహుడు, జయసింహుడికి రాజ్యాధి కారం అప్పగించాడు. అతడు ఎంతో పరి పాలనా దక్షతతో ప్రజలను రంజింపజేస్తూ తండ్రికి తగిన తనయుడనిపించుకున్నాడు.





# చిత్రకారుడి చాతుర్యం

పూర్వం మధ్యదేశం నుంచి ఒక ప్రతిభా వంతుడైన చిత్రకారుడు యవన దేశం వెళ్ళాడు.

అక్కడ ఒక అపూర్వమైన యంత్రాచార్యుడు ఉండేవాడు. ఆయన చిత్రకారుడికి తన ఇంట బస ఏర్పాటు చేసి, తన అతిథికి సేవలు చెయ్యడానికి తాను తయారుచేసిన ఒక యంత్రపుస్త్రీ బొమ్మను నియోగించాడు.

ఆ యంత్రపుస్త్రీ చిత్రకారుడికి కాళ్ళు కడిగి వెళ్ళిపోతున్నది. ఆ బొమ్మను చూసి చిత్రకారుడు నిజమైన స్త్రీయే అనుకుని, ఆమెను పలకరించాడు. కాని ఆమె జవాబు చెప్పలేదు.

చిత్రకారుడు ఆమెను చెయ్యి పట్టుకు లాగాడు. దాంతో దాని లోపలి కీళ్ళుసడలి, బొమ్మ కిందపడిపోయింది. అది యంత్రపు బొమ్మ అని చిత్రకారుడు గ్రహించి యంత్రాచార్యుడి తెలివికి, అద్భుతమైన నైపుణ్యానికి ఎంతగానో ఆశ్చర్యపడ్డాడు. కాని ఆ యవన యంత్రాచార్యుడు తనకు ఆ బొమ్మను గురించి అసలు విషయం చెప్పక, పరాభవంచేశాడు. ఇది చిత్రకారుడికి భరించరానిదయింది. ఈ పరాభవానికి తగిన ప్రతీకారంచేసి, యంత్రాచార్యుడికి తన ప్రతిభ కూడా ఎంత అద్భుతమైనదో ప్రదర్శించి, గుణపాఠం చెప్పాలని చిత్రకారుడు నిశ్చయించుకున్నాడు.

వెంటనే అతను, తాను ఉరిపోసుకుని వేళ్ళాడుతున్నట్టుగా ఒక చిత్రాన్ని చిత్రించి, ఆ చిత్రాన్ని తన గదిలోకి తొంగి చూసే వారికి కనిపించేలాగా అమర్చాడు. తరవాత అతను ఆ గదిలోనే ఒక మూలగా పడవేసి వున్న పాత కొయ్య సామానుల వెనక్కు పోయి దాక్కుని, యంత్రాచార్యుడి రాక కోసం ఎదురు చూడసాగాడు.

కొంత సేపటికి యంత్రాచార్యుడు ఆ గది ముందుగా వెళుతూ, గది తలుపులు

తెరిచి ఉండటం చూసి, అదేమిటా అని గదిలోకి తొంగిచూశాడు.

అతనికి నేలమీద పడి ఉన్న యంత్రపు బొమ్మా, చిత్రకారుడు ఉరిపోసుకుని వేళ్ళా డుతూ ఉండటమూ కనిపించాయి.

ఆ దృశ్యం చూసి యంత్రాచార్యుడు భయపడిపోయాడు. తాను తయారు చేసిన యంత్రపు బొమ్మ కీళ్ళు సడలి పోయి చెడిపోయిందన్న విచారం ఆయ నకు కించిత్తు కూడా కలగలేదు. కాని ఎక్కడో భారతదేశం నుంచి వచ్చి తన ఇంట బస చేస్తున్నవాడు ఉరిపోసుకు చనిపోయాడంటే తనకు తీరని నింద కలుగుతుంది. అయినా ఏ కారణం చేత ఇలాంటి ఘోరం జరిగిందో అధికారులు విచారించటం మంచిది.

అలా అనుకుని యంత్రాచార్యుడు తన దేశపు రాజుగారి వద్దకు వెళ్ళి జరిగిన దంతా చెప్పాడు.

ఏమి జరిగినదీ వివరంగా తెలుసుకు రమ్మని రాజుగారు తన కొలువులో ఉండే అధికారులను కొందరిని శిల్పి ఇంటికి పంపాడు.

అధికారులు వచ్చి చిత్రకారుడి గది లోకి చూశారు. గదిలోని కొక్కెం నుంచి వేలాడుతున్న చిత్రకారుడి శవం వారికి కనిపించింది.

శవాన్ని కిందికి దింపే మార్గం ఏమిటని వారు తీవ్రంగా ఆలోచించారు. కొందరు చిత్రకారుడి గొంతుకు బిగిసివున్న తాడు కొయ్యటానికి హుటాహుటిగా వెళ్ళి కత్తులూ, కటార్లూ తెచ్చారు.

ఇంతలో గది లోపల కొయ్య సామా నుల వెనక దాగి ఉండిన చిత్రకారుడు నవ్వుతూ ఇవతలికి వచ్చాడు. అతన్ని చూసి అందరూ నిర్ఘాంతపోయారు.

చిత్రకారుడు యంత్రాచార్యుడితో, "అయ్యా, మీరు యంత్రపుస్త్రీని నియో గించి నన్ను భ్రమించజేసిన మాట నిజమే. అయితే మీ తెలివితేటలతో నన్ను ఒక్కణ్ణే భ్రమింపజేశారు. కాని నేను నా తెలివి ఉపయోగించి మిమ్మల్నీ, రాజు గారు పంపిన ఈ అధికారులందరినీ కూడా భ్రమింపజేశాను," అన్నాడు.

ఆ మాట విని యంత్రాచార్యుడు సిగ్గుతో తల వంచుకున్నాడు.



# ఆర్య

అజ్ఞాత యువరాజు
విచిత్ర సాహసగాథ

5

శాంతిపుర రాజు శాంతి దేవుడి ఆజ్ఞానుసారం, రాణి శాంతకుమారి రహస్య సొరంగ మార్గం గుండా బిడ్డతో సహా తప్పించుకున్నది. సొరంగం నుంచి వెలుపలికి రాగానే ఆమె స్పృహ తప్పి పడిపోయింది. బిడ్డ జయానందముని కంటబడ్డాడు. శాంతకుమారి బిడ్డను జయానందముని సంరక్షణలో వదిలి కన్నుమూసింది. ముని ఆమె భౌతిక కాయానికి కాపలా కాయడానికి బాఘా, బాఘీలను పిలవాలనుకున్నాడు.

బొమ్మలు : గాంధీ అయ్య




బిడ్డతో ముని, శిష్యులు ఆశ్రమం చేరగానే అక్కడి పక్షులూ జంతువులూ వారికి సంతోషంగా స్వాగతం పలికాయి!


భల్లూకీ, బిడ్డను జాగ్రత్తగా చూసుకో.


నాయనా! ఈ పతకం నువ్వెవరన్నదీ బయట పెట్టగలదు. నీ క్షేమం కోసం దీనిని తీసేస్తాను.


భల్లూకీ! ఇలా రా! ఇకపై ఈ శిశువును క్షేమంగా చూసుకునే బాధ్యత నీది.




ముని నుంచి భల్లూకి బిడ్డను తీసుకున్నది. చెట్టుపై నుంచి కోతి తిమ్మన్న దిగి వచ్చింది. ఉడత, జింక, నక్క ఇలా రకరకాల జంతువులు బిడ్డ చుట్టూ చేరాయి. భల్లూకి ఒడిలో హాయిగా పడుకుని, జంతువుల చేష్టలు చూసి బిడ్డ నవ్వసాగాడు.

# వినోద సమయం

## ఒక్క గీతతో....

మహేష్ పావురాన్ని గాలిలోకి విసిరి వేస్తున్నాడు. ఈ బొమ్మను అలాగే వేయగలరా? ఏమిటీ? చాలా సులభం అంటున్నారా? నిజమే సులభమే. అయితే, ఒక్క విషయం గుర్తుంచుకోండి. మీరు పెన్సిల్‌ను కాగితంమీద పెట్టారంటే దానిని పైకెత్తకుండా ఒక్క గీతతో బొమ్మను పూర్తిచేయాలి. పెన్సిల్, కాగితం అందుకోండి మరి!

I



## దారి చూపండి

చిక్కీ అనే పిచ్చుక మహాదిగులు పడిపోతోంది. దాని పిల్ల టిప్పీ గూట్లో తల్లి కోసం ఆతృతగా ఎదురు చూస్తోంది. దానిని చేరుకోవడానికి చిక్కీకి దారి తెలియడంలేదు. ఈ చిక్కుదారి గుండా చిక్కీ గూట్లో ఉన్న పిల్లను చేరుకోవడానికి దారి చూపండి పాపం!

II

## తేడాలు గుర్తించండి

కుడివైపున ఉన్న రెండు చిత్రాలూ చూడడానికి ఒకే విధంగా ఉన్నాయి. అయితే పరిశీలనగా చూస్తే వాటి మధ్య ఆరు తేడాలు కనిపిస్తాయి. గుర్తించ గలరేమో చూడండి మరి!





(సమాధానాలు 94వ పేజీలో)

## రంగులు వేయండి

స్వాంకీ హంస, తన కొడుకు సిగ్నా సిగ్నెట్‌ను వెంట దీసుకుని సంతకు బయలుదేరింది. రెండూ కూడా తలపై తమ వద్ద ఉన్న టోపీలు పెట్టుకుని ఉత్సాహంగా బయలు దేరాయి. ఈ బొమ్మకు అందంగా రంగులు వేయండి చూద్దాం!

# ఫోటో వ్యాఖ్యల పోటీ



ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని,
చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా?
రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



SOURAA



SOURAA

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్టుకార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జనవరి 2004 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

అభినందనలు

## సెప్టెంబరు నెల పోటీ ఫలితాలు

సి.హెచ్. శ్రీనివాసరావు
ఆకెళ్ళ శ్రీహరి ఇల్లు
కొత్తపేట, ఎలమంచిలి-531 055
విశాఖపట్నం జిల్లా (ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





ఒక్క ఫోన్ కాల్ చాలు!
మధుర ఫలాలు వచ్చి వాలు!!

**వినోద సమయం సమాధానాలు (పేజీ 92-93)**

1. గుర్రం కుడి చెవి, 2. గుర్రం శరీరం మీది మచ్చలు
3. గుర్రం వెనక కుడి కాలు, 4. బండిమీది చారల సంఖ్య
5. బండి చక్రం చీల.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

